శ్రీ సద్గురు పరబ్రహ్మానేనమః



# బోధానందలహరి

రచయిత:

రాఘవాపురపు తిరుపతిదాసు.

ప్రకాశకులు:

శ్రీ శీలంనేని కోటయ్యగారు,

గొట్టుముక్కల,

నందిగామ తాలూకా.

ప్రథమ ముద్రితము: వెయ్యి కాపీలు

శ్రీ మన్మథనామ సం॥ ఫాల్గుణము

1956

# ఓం

ఓసోదర సోదరీమణులారా!

సర్వేశ్వరుని దివ్యకరుణచే, మనగ్రంధకర్తచే రచింపబడిన, గ్రంధములలో సీబోధానందలహరియను గ్రంధము మొదటి రచయితమైయున్నది. తరువాయి గ్రంధములు భక్తులకోరికననుసరించియు, ముద్రింపజేయుటకు కావలసిన డబ్బు యెక్కుతక్కువ తారతమ్యముల ననుసరించియు, ఆయాగ్రంధములను ముందువెనుకగా ముద్రింపజేయబడెను. యిప్పటికీగ్రంధమును ప్రకాశింపజేయుటకు కావలసిన ధన సహాయముజేసి మన శీలంనేని కోటయ్యగారు గొప్ప కీర్తిని సంపాదించుకొనుటయేగాక, ఉత్తరజన్మకు యీపవిత్రవిని యోగఫలము, అమృతభాగ్యప్రాప్తికిదారిగదా! మన కోటయ్యగారు అనేక భక్తులకీ పావన, గ్రంధములను అందజేసినందులకు భక్తవత్సలుడైన సర్వేశ్వరుడు వీరి కుటుంబమునకు భాగ్య భోగ్యములనిచ్చి అన్నివిధముల కాపాడుగాక॥

ఓ సోదరులారా! యీగ్రంథమందు పాఠకులైనవారు అనేక విషయములను సులభముగా గ్రహించి, పరిణామ మనస్కులై తరించుటకును, మన భవరోగ నివృత్తికిని, తగిన దివ్యౌషధమైయున్నది. గనుక ప్రతివారును తప్పక పఠించి పరిశీలనగావించిచూచి మీమీ పరిణామమార్పులు మీరే తెలుసుకొని సాటియాత్మ సోదరులైన మీ మీ స్నేహితులకును, బంధువులకును, యీ పావన గ్రంథములను అందజేయుటకు ప్రయత్నముగూడా జేయగలరని నమ్ముచున్నాము.

ఇట్లు. భజన సమాజము.

# విషయసూచిక

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

## 1. గురుశిష్య సంవాదము

ఒకానొక సమయమున శ్రీ సద్గురుమూర్తి సమాధి చాలించి సుఖాసీనుడై విశ్రమించి యుండగా, మహాభక్తి యుక్తుడై చేదోయి జోడించుకొని శ్రీసద్గురు చరణారవింద ములకు సాష్టాంగ నమస్కార మాచరించి నిలచి కన్నుల వెంట నానందాశ్రు బిందు సందోహము స్రవింపచుండగా ముకుళిత హస్తుడై :—

దండకం – శ్రీసద్గురుం జ్ఞానహీతారమీశం ప్రసన్నాస్య మానంద కందం । మహామోహపాశఛిదం । యోగివర్యం । నతానేక యోగీశబృందం । నమచ్ఛిష్య హృన్మందిరాంతస్థ పాదారవిందం । మహాంతం । త్రిమూర్తి స్వరూపం । జగద్వ్యాప్య సత్యప్రతాపం । హృదజ్ఞాన గాఢాంధకార ప్రదీపం దళద్ఘోర సంసార తాపం । దురాపం । శరచ్చంద్రికాకాశ నీహార కర్పూర గోక్షీర ఫేనాభ గౌరాచ్ఛకీర్తిం । చిదానంద మూర్తిం । సదాచార సంపన్నతా చక్రవర్తిం । గతార్తిం । భజే దేవ దేవం । భజేభాగధేయం । భజేస్వప్రకాశం । భజే స్థూల సూక్ష్మాదిశూన్యం । వదాన్యం । భజే భక్త విజ్ఞాన దాతృత్వ దక్షం । భజే సత్కటాక్షం । భజేజ్ఞాన జంఝూనిలోద్ధూత జన్మాప్యయ వ్యాధి జీమూతవారం । సుదాక్షిణ్య పూరం । మహాయోగివీరం । సదానందసారం । పరివ్రాజ

శాగ్రేసరం । వీతరాగం । సదాబ్రహ్మనిష్ఠాగరిష్ఠం । ప్రపం చోపకార క్రియాయుక్త బోధావతారం । దురీహా లతాచ్ఛేదనోద గ్రదాత్రం । జనస్తోత్రపాత్రం । శరీరాత్మ భ్రాంత్యాటవీ । నీతిహోత్రం । పవిత్రం భజే నిర్వికారం । భజేదుష్టదూరం । భజే సర్వ వేదాంత లక్ష్యానుకారం । భజేవాగతీతం । భజే లోకపూతం । భజే వాసనాక్లేశ పాథోధిపోతం । భజే సువ్రతం । సర్వవేదాంత లక్ష్యానుకారం । భజే దేశికం । త్వాం । భజేహం । భజేహం॥

అని స్తోత్రముచేసి వెండియు సాష్టాంగ నమస్కార మాచరించి భక్తిపరవశుడై నిలచియున్న శిష్యుని పరమ కారుణ్యముతో చూచి:—

గురువు:- వత్సా! నేను వ్రాయుమనిచెప్పిన గ్రంథముపూర్తియైనదా? వ్రాయుచుంటివా?

శిష్యుడు:- ఏదియును లేదు. స్వామీ క్షమింపుడు.

గురు:- ఏమిది? నీవేల వ్రాయవైతివి?

శిష్యు:- గురూత్తమా! మీయాజ్ఞదాటరానిదగుటచే వ్రాయుటకు సిద్ధముగానే యుంటినిగాని యొకసందేహము నన్ను తారుమారు సేయుచున్నది.

గురు:- ఏమా సందేహము?

శిష్యు:- మహాత్మా! అగ్రహింపక, యజ్ఞుడనగు నామనవిని సమగ్రముగా విన ప్రార్థితులు. మహాత్ములగు పెద్దలు వేద

వేదాంగములదుదనుట్ట జదివి, యందలి సారమును పరోక్షముగా నెఱిగి, యల్లనల్లన జరితార్థులగుటకు సద్గురుమూర్తి పాదములు నాశ్రయించి, శ్రీవారి యనుగ్రహమునుబొంది గురూపదిష్ట మార్గమున బ్రహ్మవిచారణ సలిపి, తత్వనిశ్చయులై, ప్రపంచోపకారాసక్తులై, సుకర్మాచరణ వలనగాని చిత్తశుద్ధి కలుగదనియు, చిత్తశుద్ధి కలిగినగాని యద్వైతమందు అనురాగము కలుగదనియు తలంచి, కొందరు (ఇష్టాపూర్తములను) ఇష్టములనగా వేదమునందు చెప్పబడినట్లు యజ్ఞములు మొదలగునవి చేయుట. పూర్తములనగా చెరువులు, బావులు త్రవ్వించుట, దేవతా ప్రతిష్ఠలు చేయుట, సప్తాహములు, భగవత్సంబంధములగు వ్రతములు మొదలగునవి చేయుట. ఈరెంటిని యిష్టాపూర్తములందురు. ఇట్టి వానిని గుఱించి తమ తమ బుద్ధి బలముకొలది గ్రంథములు వ్రాసి పామరులకొకవిధమగు దారిని చూపిరి. మఱికొందఱు ప్రకృతి విలాసముల ననుభవరూపముగ జూపియిది గారడివంటిదనియు భక్తి జ్ఞాన వైరాగ్యములు అను మూటిలో మోక్షసాధన సామగ్రియందు భక్తి గొప్పదని నిర్ణయించి వ్రాసి, లోకమునకుపకరించిరి. మఱికొందఱు జ్ఞానము; వైరాగ్యము; ఉపరీతి ఈమూడును కలిగిన మనుజుడే మోక్ష సామ్రాజ్యమేలుటకర్హుడని యుపనిషదర్థముల బ్రతిపాదించు గ్రంథముల శ్లోకరూపముగను; పద్య రూపముగను; గద్య రూపముగను; కొంచెము పాడనేర్చినవారు తత్వరూపముగను గ్రంథములను వ్రాసి; దురంత సంతాపకరమగు సంసార దావాగ్నినుండి తాము తప్పుకొని ముముక్షువులను తద్భయమునుండి తొల

గింపకలిగిరి. అయ్యా! సద్గురూ! నేనట్టిమహాత్ముల పాదరజమునుగూడ బోలను; చదువా: బండిగాలంతసున్న; జ్ఞానమా; గగనకుసుమము; పెద్దచదువులేకున్నను ఉక్తలేఖనమయిన సరిగా వ్రాయ లేనినేను. పెద్దపండితునిలాగున మీరు వ్రాయ నాకాజ్ఞాపించిన గ్రంథమును నేను వ్రాయ గలుగుదునా, యను సందేహము నన్ను పూర్తిగ బాధించుచున్నది. మహాత్మా! క్షమింపవలయును.

గురు:- ఓయీ! నీవింత సంశయము పడనవసరము లేదు. బొల్లిపంగనామాలయ్యా! భోంచేయుదువు, బొల్లిగద్ద నెక్కి-రావయ్యా! అని భగవంతుని సంభోదించి కృతార్థుడైన నిరక్షరాస్యుని చరిత్రమూ బాలగోపాలమును తెలిసినదే కదా. ఆతడే శాస్త్రముచదివెను? జ్ఞానమునకు విద్యయవసరము లేదు. అయినను విద్యగలవాడు జ్ఞానముకలవాడయ్యెనేని, బంగారమునకు సువాసనయు గలిగినట్లుండును. స్తవనీయముగా నుండును. కొందఱు విద్వాంసులు సభారంజకముగా నుపన్యసింప నేర్తురుగాని, చెప్పినట్లు తామాచరింపనేరరు. కొందఱు జనరంజకముగా సభలలో నుపన్యసింప నేరరుగాని, విన్నకన్న పరమార్థముల శక్తివంచన లేకుండ సమాచరింప నేర్తురు. గనుక చదువురానివాడనని సంశయించుట సమంజసముకాదు. ఇటుచూడు, నాలుగు చిన్నముల బంగారమిచ్చినవాని కగసాలి నాలుగుచిన్నముల తగినట్టి యాభరణమే చేసియిచ్చి సంతోషపఱచును. విద్యయనునది పెద్దచెరువు. ఆతటాకమునందలి మధుర జలముల వారివారికిగల పాత్రలతో జనులు

తెచ్చుకొని తృప్తిపడుదురుగాని, ఒకనికి పెద్దపాత్ర కలదని యొకడు తన చిన్నపాత్రను దూరముగా పాఱవేసి యూఱకొనునా? మఱియొక పాత్రలేనియపాత్రుడు తన దోసిలియే పాత్రగా జలమును గ్రోలడా? అట్టిసందర్భములో నాకుచదువు రాదని నీవెందుకు సందేహింపవలెను? ఆయా సమయముల నీసందేహమును పరమాత్మయే తీర్చి నీయుద్యమము నిరాఘాటముగా సాగింపగలడు.

శిష్యు:- సద్గురు ప్రభూ! నేనొక్క మనవి చేయుచున్నాను. అజ్ఞుడను, నాయందాగ్రహింపక విన వేడుచున్నాను.

గురు:- ఏమది?

శిష్యు:- నాహృదయమునగల సందేహములనెల్ల దేవరవారి వలన తీర్చుకొని యనంతరము——

గురు:- గ్రంథము వ్రాయవలయుననియా నీతలంపు? మంచిదే అడుగుము నీ సందేహములను తీర్చుటకుసిద్ధముగానున్నాను ఇదియే నిన్ను వ్రాయుమని చెప్పిన 'భోదానందలహరి' అను గ్రంథమగును.

శిష్యు: మహాప్రసాదము. నమస్కారము. అయ్యా! ఆత్మఎట్టిది? అనాత్మ ఎట్టిది?
గురు: పరమ సంతోషము. ప్రశ్న యెప్పటికిని చిన్నదిగను, ప్రయోజనకారిగ నుండవలెను.

## (బ్రహ్మము) ఆత్మ లక్షణము

**ఆత్మ:** సత్తు, చిత్తు, ఆనందము అను మూడును స్వరూపముగాకలది. మఱియు నది అద్వయము, అఖండము. సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితము. పంచకోశ వ్యతిరిక్తము. శరీరేంద్రియాతీతము. నిర్వికారము. నిరుపాధికము. నిష్కళంకము. దేశకాలాపరిచ్ఛిన్నము. నిత్యము. అవస్థా విలక్షణము. సత్తామాత్రము ఓయీ! దిక్కులు చూచుచున్నావు. నేను చెప్పిన యీయాత్మలక్షణము నీకు కొబ్బరికాయ నాకినట్లుండవచ్చును. ఇదిగో మరల చెప్పెద వినుము. సత్తు అనగా భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము అనెడి మూడుకాలములయందును మరే వస్తువుచేతను బాధింపబడకయుండునది

చిత్తు అనగా మరియొకసాధనమపేక్షింపక, నిత్యము తాను ప్రకాశించుచు, తనముందుకల సర్వమును ప్రకాశింప జేయునది.

ఆనందము అనగా పూలదండలు, స్త్రీలు, మైపూత, భోగభాగ్యములు మొదలగువాని వలన గలిగిన యానందమేనా? అందువేమో, అది కాదు. సుషుప్తియందుగలదేదియో ఆదే ఆనంద స్వరూపము. అన్ని యానందములకంటె నదియే యధికానందమనుటకొక దృష్టాంతము చెప్పెద: లోకములో పురుష జాతికి అన్ని తెరగులయిన యానందంబులకంటె సురతానందమధికము. తన ప్రక్కనున్న సౌంద

ర్యవతియగు స్త్రీ నవల విడచి నిదురించుచున్నాడు. ఆసమయమున తన నిద్రాసుఖమునకించుక భంగము కలిగించునవ్వేలదిని కోపించుచున్నాడు. గనుక సుషుప్తియందలి యానందమే బ్రహ్మానందము. అద్వయమనగా: తనుగాక రెండవది లేనిది. అఖండమనగా వేఱుచేయుట కలవిగానిది.

సజాతీయము అనగా చెట్టుకు చెట్టు సజాతీయము. స్వగతములనగా చెట్టునపుట్టిన పూలు, పండ్లు మొదలైనవి. విజాతీయములనగా చెట్టుకు పాలు, గుండ్లు మొదలగునవి. అనగాతనయందు పుట్టినవిగాని, తనకితరములగునవి కాని వేనని తాత్పర్యము పంచకోశములు అనగా అన్నమయము. ప్రాణమయము. మనోమయము. విజ్ఞానమయము. ఆనందమయము అనునవి వీనికి వ్యతిరిక్తుడనుట, శరీరేంద్రియాతీతమనగా: శరీరమనగా అవి మూడు విధములు స్థూలము, సూక్ష్మము, కారణము. ఈమూటికిని ఇంద్రియములు, కర్మేంద్రియములయిదు. జ్ఞానేంద్రియములయిదు. ఈ పదింటికిని కూడ నతీతమనుట నిర్వికారము. అనగా ఏవిధమగు మార్పులును లేనిదనుట. నిరుపాధికము అనగా ఏవిధమయిన ఆధారము (శరీరము) ను లేనిది. నిష్కల్మషము అనగా యేవిధమయిన విషయవాసనలు లేనిది. దేశకాలాపరిచ్ఛిన్నము. దేశముచేతను, కాలముచేతను, భేదింపరానిది. అనగా ఉపేంద్రుడు అను పేరుగలవాడు ఇరువదియేండ్ల వయసు గలవాడైయుండగా మన యూరిలో చూచితిమి. వానినే అరువదియేండ్ల వయస్సు గలవాడైనపుడు, విజయనగరములో చూచితిమి.

ఇరువదియేండ్ల వాడైనప్పుడు నుపేంద్రుడే. అరువది యేండ్ల వాడైనప్పుడు నుపేంద్రుడే. మనయూరిలో చూచినప్పుడు ఉపేంద్రుడే. విజయనగరములో చూచినప్పుడు నుపేంద్రుడే. మనయూరు విజయనగరము అను స్థలములయందును, వాడు వాడుగా నేయున్నాడు. ఇరువది యేండ్ల పుడు అరువదియేండ్ల పుడు కూడ వాడువాడుగా నేయున్నాడు. గనుక దేశముచేత కాలముచేతను వేరుచేయరానివాడని తాత్పర్యము. అవస్థా త్రయ విలక్షణము అనగా మూడవస్థలకు వేరయినవాడు. ఆత్మలక్షణములివి, అనాత్మ, జడము, అనృతము, నశ్వరము దుఃఖమయము.

శిష్యు: స్వామి ఇట్టి యాత్మకు జీవుడను పేరెందుకువచ్చెను? జన్మలేల కలిగెను?

గురు:- అనాదియగు అజ్ఞానమావరించి, అహంకార మమ కారములకు లోనై తన యింద్రియములు పడలాగినట్లెల్ల పోయి దేహాత్మ భ్రాంతి మిక్కుటమై నేను జీవుడనని. నా యిల్లు, నాభార్య, నాపుత్రులు నా...నా...యని ప్రాకులాడు చుండుటను జూచి అట్టి దేహధారిని జీవుడనియజ్ఞానులు చెప్పు కొందురుగాని, పరమార్థమున జీవుడే పరమాత్మ. పరమాత్మయే ప్రత్యగాత్మ. ఆత్మకే బ్రహ్మమనియు, ప్రత్యక్ అనియు, దృక్కనియు, సాక్షియనియు నామాంతరములుకలవు. జీవుడని యజ్ఞులువాడుదురు. ఆపేరు అధ్యాసవలనకలిగినది. ఆత్మకు జీవత్వము కల్పితము. సంసారమంతకంటె కల్పితము. ఇది

అధిష్టానాజ్ఞానమువలన నిట్లారోపింపబడినది. త్రాడును జూచి పామని తలంచుటయు, ముత్యపు చిప్పయందలి తళుకునుజూచి వెండియని తలంచుటయు; యెండమావులనుజూచి జలప్రవాహమని తలంచుటయు. మొద్దును జూచి పురుషుడని తలంచుటయు, ఆకాశము నీలివర్ణమని తలంచుటయు నెట్లో, అట్లే శుద్ధపరిపూర్ణ సచ్చిదానందాఖండాద్వయంబగు బ్రహ్మము నందు, జీవత్వ భాధకత్వ, సంసారంబులు కల్పింపబడినవి. ఇక జన్మలేల కలిగినవనికదా నీవడిగినది. సమాధానము చెప్పెద విను...

అధిష్ఠానా జ్ఞానమునజిక్కి వాసనాబద్ధుడై క్రమ క్రమమున తన్నుదామఱచి దేహాత్మ భ్రాంతి నానాటికి దట్టమగుచుండ, పుణ్య పాపకర్మల నాచరించి, తదనుగుణ్యములగు జన్మలెత్తుచుండును. బ్రహ్మమేనా, అందు వేమో బ్రహ్మము కాదు. ఈపుట్టుట పెరుగుట. చచ్చుట యనునవి శరీరమునకే గాని బ్రహ్మమునకేమియు సంబంధములేదు. నేను చెప్పునది శరీరమును గురించి మాత్రమే. ఈశరీరమొక కర్మఫలమున మాత్రమేకాదు. పంచీకృత భూతంబులు శుక్లశోణితంబులుగా పరిణమించి, తద్వారా కూడివచ్చినవి ఎట్లందువా? మట్టి ముద్ద నొక్కదానిం దెచ్చి, నిలువబెట్టినంత మాత్రమున నది కుండయెట్లగును? ఆమట్టిముద్ద కుమ్మరి నేర్పుకొలది పెక్కు రకములగు కుండలు, పిడతలు. బుంగలు, మూకుళ్లు మొదలగునవి పుట్టుచున్నవి. అట్లే కర్మవైచిత్ర్యమునుబట్టి పంచీకృత మహాభూత పరిణామంబులగు శుక్లశోణితములద్వారా శరీర

ములు పుట్టుచున్నవి. కుండలు మృణ్మయంబులయినను ఒక్క మృత్పిండమున్నంత మాత్రమున కుమ్మరిపని లేకుండ కావు. కుమ్మరి పనివాడయినను, మట్టిలేనిది కుండలెట్లు కావో, అట్లే ఈశరీరము కర్మ జన్యమయినను, పంచభూత పరిణామంబగు శుక్ల శోణితద్వయ విశిష్టిత వలన కలిగినవి. గనుక శరీరముల పుట్టుకకు కర్మయును, శుక్ల శోణితములును కారణములు. కర్మ భేదములనేకములు గనుక శరీరములుకూడ అనేక విధ ములగా జన్మించినవి.

శిష్యు:- ఆచార్య వర్యా! సంసారబద్ధునకును, సంసారబద్ధుడు కానివానికిని గలచిత్త భేదమేమి?

గురు:- విను... సంసారబద్ధుని చిత్తముగాలిలో బెట్టినదీపము లాగున నొకప్పుడయినను నిలుకడలేక సర్వదా చలించు చుండును. సంసారికానివాని చిత్తము గాలి తగులనిచోట గల దీపములాగున నచంచలమై ప్రకాశవంతముగానుండును. మఱియును బద్ధసంసారునకేదియైన దుఃఖము సంభవించినచో వర్ష కాలమేఘము మెల్ల మెల్లగా నావరించి కాఱుక్రమ్మి, విపరీతముగా కురిసి చెరువులను కుంటలను నింపి వెల్లువలై గోడలు. కొంపలు కూల్చి పైరు పంటల నెట్లు పాడుచేయునో అట్లే అజ్ఞాని దుఃఖము తననేగాక పెరవారినికూడ దుఃఖముల పాలుచేయును. సంసారి కానివాని దుఃఖము శరత్కాల మేఘములాగున ముందు గాఢముగా నావరించి కొంచెము వర్షించి వెంటనే తెరిపిచూపి, వింతవారిని గూడ సంతోష ములో ముంచును. ఇది వారి తారతమ్యము.

శిష్యు:- నేను పశుప్రాయుడను. రహస్యాతి రహస్యంబగు నీ బ్రహ్మవిద్య నెట్లు గ్రహింపగలను?

గురు:- నీవు పశుప్రాయుడవే యగుదువేని చెడుకోరికలు అను గడ్డిమేయుటకు, విషయులోల పశుగణముతోనే కలిసి పోయియుందువు. కావు గనుకనే నాయొద్దకు వచ్చితివి నీవు తెలియని వాడనని యెన్నటికిని సందేహింపకుము. వెనుక గడచిన జన్మలయందు పరమేశ్వరారాధనచేసి తదనుగ్రహము పొందినవాడవు గనుకనే శ్రవణము చేయవచ్చితివి. తెలివి గల వాడనని యెవరును గర్వింపరాదు. ఎంత తెలిసినవాని కైనను తెలియదగు సంగతులు పెక్కులుండును. సత్సహవాసము చేయుచు, దుర్జనులతో కూడక, పరాపవాదముల పరిత్యజించి, సకారణముగా నయినను పరులను దుర్భాషలాడక పరస్త్రీ, పరధనముల నపేక్షింపక, భగవన్నామ సంకీర్తనంబు జేయుచు, స్వస్వరూపము నెట్లుటుంగుదునా యను తలంపుతో పెద్దలను సేవించు వాడెన్నటికిని చెడడు. అట్టివాడు పశుప్రాయుడునుకాడు. గనుక భగవంతునిపై భారము వేసి నీవు గ్రంథ రచనకు బూనుము. నీకుభగవంతుడే అన్నిటికి తోడ్పడును.

శిష్యు:- కృతార్థుడను. మహాత్మా. సాధన సంపత్తి లేనిది వేదాంత శ్రవణము తగదందురు. ఎందు వలన? ఆ సాధన సంపత్తి యేదో సెలవిండు.

గురు:- చాల సంతోషము. ముందు తెలిసికొనదగినదానికే యడిగితివి. చెప్పెదను, ... సాధనములు నాలుగు. నిత్యా

యున దేదో, అనిత్యమగున దేదో తెలిసికొనుట. 2. ఈ లోక సుఖమును, స్వర్గలోక సుఖమునుకూడ తిరస్కరించుట. 3. పది యింద్రియములను జయించుట.

శిష్యు:- స్వామీ! శమాదిషట్కము అందురీపది యింద్రియ ములజయించుటేనా?

గురు:- ఓహో! అగునుగాని క్రమముగా చెప్పెదను వినుము శమాదిషట్కము అనగా శమము మొదలుగాగలవి ఆరు అని అర్థము. 1. శమము అనగా లోని యింద్రియములను జయించి మనస్సును వేదాంత శ్రవణమునందు నిల్పుట. 2. దమము అనగా వెలుపలి యింద్రియములను విషయములమీదికి పోకుండ నిలిపి మనస్సును వేదాంతశ్రవణమునందు నిలుపుట. 3. ఉపరతి అనగా విధివిహితములగు కర్మలుచేయుచు. కర్తృత్వము లేకయుండుట. 4. తితీక్ష అనగా శీతము ఉష్ణము మొదలగు ద్వంద్వములనోర్చుట. 5. శ్రద్ధ అనగా గురువులు చెప్పిన మాటలయందు గాఢమయిన నమ్మకము. 6. సమాధానము అనగా పెడత్రోవలబోవు మనస్సును చిక్కబట్టి వేదాంత శ్రవణమునకు త్రిప్పుట,

1, శమము. 2. దమము. 3. ఉపరతి. 4. తితీక్ష, 5. శ్రద్ధ 6, సమాధానము. శమాదిషట్క సంపత్తి అనగా ఇది ముముక్షుత్వము. అనగా మోక్షముపై కోరిక అను దానితో కూడ సాధన చతుష్టయమందురు. ఓయి నన్నడుగుట శిష్య ధర్మము గనుక నడిగితివి. నీవీ నాలుగు సాధనలు కలవాడవే

అని నేనెఱుంగుదును. ఓయీ ఇకనీవాలసింపక గ్రంథరచనకు దారకొనుము. చదువురానివాడనని సందేహింపకుము. భగవదనుగ్రహమును సమార్జింపవలయునుగాని అదిసమకూడిన వో సర్వ సమర్థతలు సమకూరును. శ్రీ కాళిదాసు కాళికాంబా ప్రసాదమునగదా పండితశ్రేష్ఠుడయినది. తెనాలి రామలింగ కవి దేవీ ప్రసాదలబ్ధ కవితాశిరోమణి కాలేదా? శ్రీపోతనా మాత్యుడు రామచంద్రుని యనుగ్రహమునగదా సహజ పాండిత్య బిరుదును వహించి, భాగవతాది గ్రంథములవ్రాసి సిరకీర్తియైనది. వేములవాడ భీమకవి భీమేశ్వరునియనుగ్రహమునగదా శాపానుగ్రహ సమగ్రంబగు కవిత్వమును చెప్ప నేర్చినది. వేమన, శివయోగి గురుప్రసాదమున సకల పండిత పామర రంజకంబుగా జ్ఞానామృత ధారలను తన మాధుర్య కవిత్వ ధారాధరంబులనుండి వర్షింపజేయ గలిగినది. వెఱ్ఱి వాడా! భయపడ వలదు. సర్వ భారములను మాపయి మోపుము. సర్వమును మేమే నిర్వర్తింతుము.

శిష్యు:- పరతత్వమునుగూర్చి సర్వజనరంజకముగా వ్రాయ గలవారనేకులుండగా కించిజ్ఞుడనగు నాచేవ్రాయింప తమకేల కృపగలిగెనో సెలవిందు.

గురు:- అది నీయదృష్టము... మహావిద్వాంసులు, విద్వత్కవి పుంగవులు లెక్కకుమీరియుండ వారందఱిలో నొకనికయిన శ్రీవ్యాస భట్టారక విరచితంబగు సంస్కృత భాగవతము నాంధ్రీకరింప బుద్ధియేలజనించకుండవలెను? జనియింపకున్నను

మడ్గుణైశ్వర్య సంపన్నుండును, పరబ్రహ్మ స్వరూపుండునగు శ్రీరామచంద్రమూర్తికి పోతనామాత్యునిచే నద్దానివ్రాయించు నంతటి యనుగ్రహమేల జనింపవలెను? జీవకోటిలో శుద్ధజీవులనియు, మలిన జీవులనియు రెండు తెగలుగా నుందురు. మలినజీవులు దారాపుత్రాది కుటుంబపోషణ లాలసులై తమ యుత్తరగతి నాలోచింపక, తామస రాజస కర్మల నాచరించి క్రమక్రమంబున నధః పతనులై క్రిమికీటకాది యోనులం బుట్టుచు, జచ్చుచునుందురు. వారికి పారమేనాటికి లభించునో నిర్ణయింప భగవంతుడే కావలయును ఇక శుద్ధ జీవులనగా బహు జన్మలనుండి సత్కర్మానుష్ఠానము, నిష్కాములై చేయుచు తత్ఫలముల పరమేశ్వరార్పణచేయుచూ భగవన్నామ సంకీర్తనము, భగవదాచ్ఛైంకర్యము భాగవత సాంగత్యము, భగవత్కథా పఠనము, భగవత్కథా శ్రవణము, పరోపకారము, సర్వజీవ సమత్వము, సర్వావస్థలయందును జేయుచు, ప్రారబ్ధ క్షయము... అనగా ఆజన్మకనుభవింపదగిన కర్మ ఫలము తీరగనే సుఖకరముగ దేహత్యాగము చేసి, సాలోక్యము, సారూప్యము, సామీప్యము, సాయుజ్యము అను చతుర్విధ ముక్తులలో స్వకర్మానుగుణములగు ముక్తులనంది, తిరుగ జన్మించి, సత్కాలక్షేపము చేయువారు, అట్టివారు వారివారి పూర్వ కర్మానుగుణముగా కొందఱు భాగ్యవంతులుగను, కొందరు భాగ్యహీనులుగాను, కొందఱు రూపవంతులుగను, కొందఱు కురూపులుగను; కొందఱు పండితోత్తములుగను కొందఱు పండితులుగను; కొందఱు పాండిత్య విహీనులుగను జన్మించి తమతమ కర్మను

సారముగా భగవదనుగ్రహ కీర్తి లాభములనుపొందుచుందురు. ఇందుకు సందేహము లేదు, కొన్ని నిదర్శనములను చెప్పెదను విను... ఎన్నడో రవి కులమును పవిత్రముజేయ నాదినారాయణమూర్తి రాముడన జన్మించునని యాశతో భాను కులమునకు పౌరోహిత్యము చేయుచు, శ్రీరామ సందర్శనమునకెదురు చూచెడి వశిష్ఠ మహాముని నట్లుంచి శ్రీరామ చంద్రమూర్తి నాదికవంశ విభుండగు గుహుని తరింపజేయ లేదా? తనను సేవించుచు తనవెంటనరుదెంచు విశ్వామిత్రుడు చూచుచుండ, పాషాణమై యడవిలోపడియున్న గౌతమాంగనను కనికరింప లేదా? విరూపియు, నపండితయునగు శబరి యెంగిలి పండ్లనారగించి యామెను కృతార్థురాలినిచేయ లేదా అనుదినంబును తనను సేవించెడి మహాయోగీశ్వరులను విడచి కబంధుని ముక్తికాంతాపరిగ్రహునిచేయ లేదా? ఇట్టివి యెన్నియో కలవు. నందనార్ అను చండాలుని తన దర్శనము కాకుండ బేదబుద్దిగలవారడ్డగింపగాదయామయుడు పరమశివుండైక్యానంద మహాపద మొసంగెననుట సర్వజనవిదితము. భగవదనుగ్రహపాత్రులగు వారుపండితులనియు, పామరులనియు, చక్రనివారనియు, కోతిరూపముగలవారనియు భేదము లేదు. దయామయుడగు సర్వేశ్వరునకు భేదదృష్టి యెన్నడును లేదు. కర్మపరిపక్వ దేహధారుల ననుగ్రహించుటలో పండిత పామర విచారణ, మందుకు, కూడ సర్వాంతర్యామి హృదయమున తోపదు. గనుక గురువులనగా భగవద్రూపులని త్రిశుద్ధిగా నమ్మియున్న నీకు నేను వేఱుగా చెప్పనక్కరలేదు. మేము భగవంతునిలాగున గాకున్నను సర్వస్వతంత్రులము గనుక

నిన్ను తరింపజేయతలంపున (భోదానందలహరి) అను గ్రంథ
మును వ్రాయనీకాజ్ఞాపించితిమి. వెనుకంజవేయుట నీకు కేవల
పరమార్థభంగము. గుర్వాజ్ఞోల్లంఘున దోషమునకు గురిగాక
సందేహము వదలి...రచింపుము...పొమ్ము.

శిష్యు:- స్వామీ! గణము, యతి ప్రాస లక్షణము తెలియని
వాడనుగదా కవిత్వమెట్లు చెప్పగలనా యనినాసందేహము.
గురు:- (నవ్వి) తాతాచార్యులవారి కవిత్వము కొంత, నా
పైత్యముకొంత అనునట్లున్నది నీమాట. నిన్ను నేను వచన
కావ్యము రచింపుమనుచుండగా గణయతిప్రాసలు తెలియవని
చెప్పుచున్నావు. వచనమునకు గణ యతిప్రాసలతోనవసరము
లేదు. విషయ రచన రుచికరముగా నుండుట యవసరమే
యనుకొమ్ము, అయినను చెఱుకునకు వంకబోయిన జెడునే
తీపి. తప్పబడినంత సద్భక్తి తక్కువౌనా, అని యొకభక్తుడు
వ్రాసికొనియున్నాడు. అయినను యక్షగానములందుకూడ
కొందఱు వారి చిత్తానుసారము వ్రాసియున్నారు. ఏమనుచు
వస్తివే వెలది నాయింటి ముప్టెత్తుకోపోతే మూడు సంచులు
లేవు. ఎత్తుకదినబోతే ఏడు సంచులు లేవు. కనడా వినడా
ఎరుగడా దేహంబు । ఆశివ యేమనివస్తివే॥ (దక్షుని
యజ్ఞముపాట) ఇందులో భాషాపారిశుధ్యమయిన నున్నదా?
ఎవరికి తోచినట్లువారు రచియింపుచుండుదురు. అట్లు రచియిం
చుటకంటె భక్తిజ్ఞాన వైరాగ్యములు హృదయమునగలవారు
వాటిని గూర్చిన యాదార్థము నెట్టిమాటలతో వ్రాసినను
అవికలవారికి పఠనీయములుగానే నుండును. వారికవి

పరమార్థదాయకములుగా గూడనుండును. సర్వ జలము మేధ్యా మేధ్య స్థలంబులం బడి చిన్న కాలువలై వాగులై యవి గంగా గోదావర్యాది పుణ్యనదులలో గలసి పవిత్రతమములై తమయందు క్రుంకిన వారిని పునీతులజేయుటలేదా. అట్లే తెలిసి తెలియని నీరచన భక్తిరసముతో మిళితమై పాఠకులను పావనులను జేయుననుటకు సందేహము లేదు.

శిష్యు:- సద్గురుమూర్తీ! గ్రంథారంభమున పరబ్రహ్మ స్వరూపులగు మీ పాదములను ధ్యానింపవలెను గదా. నాకా పథము తోచకున్నది.

గురు:- ఓయీ! కొంతవరకు నీ యూహ స్తవనీయమైనది. గురుస్థానము నధిష్ఠించిన కారణమున మేము చెప్పదగినది కాదు కాని చెప్పనిది సామాన్యులకు తెలియదు పరమాత్మతత్వమే గురుతత్వము. ఆత్మలక్షణము నీకిదివరకు నేను చెప్పియున్నాను అన్నియు నాలక్షణములే గురుతత్వమునకును. ముందు గురువనగా నర్థమేమో కొంచెము చెప్పెద వినుము ... గు ... అనగా సంసారాంధకారము ... రు ... అనగా ఆయంధకారమును నిరోధించు తేజస్సు. అందువలన గురువు అని మహాత్ములకా పేరు నిర్ణయింపబడినది. మఱియు గురువు తండ్రికంటె చిర వందనీయుడు. ఎందుకనగా తండ్రితన వీర్యమున జన్మనిచ్చిన వాడు. గురువో తనజ్ఞానవీర్యమున నెన్నటికిని పునరావృత్తి లేకుండ జన్మరాహిత్యమును చేయువాడు. అదిగాక శిష్యుని పాలిట హరిహరులకంటె నధికుడు, గనుకనే "హరౌరుష్టే గురుస్త్రాతా

"గురౌరుష్టేకశ్చన'' అనగా పరమేశ్వరుడు కోపించినయెడల గురువు అనుగ్రహించి కాపాడును. గురువునకు కోపమువచ్చి నా... ఇకరక్షకులులేరు. అందువలన గురువును తిరస్కరింప రాదు. గురువాక్య పరిపాలనము ముఖ్యముగా చేయనగును. నిరంతరము గుర్వాజ్ఞకు బద్ధుడై తచ్చరణ కమలముల నాశ్రయించి యుండవలెను. పూర్వము త్రిశంకు మహారాజు తన గురువగు వశిష్టునకు నమస్కరించి .. గురూత్తమా నేనీ పాంచ భౌతిక శరీరముతో స్వర్గమునకేగి యచట నందన వనమునందును మఱియు దక్కంగల సుందర మందిరారామంబుల కామోప భోగముల ననుభవింపవలయునని కోరిక గలిగినది. గనుక నాచే నట్టి ఫలదాయిని యగు యఘము చేయించుమనికోరగా, వశిష్టుడమ్మాటలకంగీకరింపక ఈ శరీరముతో స్వర్గసుఖములనుభవించుట దుర్లభము. గనుకనీవట్టి కోరికవిడువమనగా త్రిశంకుడు కోపించి, మఱియొకని బ్రహ్మగా నియమించుకొని చేయుదును, నీవికపొమ్మనగా గురువగు వశిష్టునకు కోపమువచ్చి, ఓరీ! నన్ను తిరస్కరించి పలికితివి గనుక శ్వపచుడవు కమ్మని శపింపగా త్రిశంకుడు వెంటనే కిరాతరూపుడై పోయెను. గనుక నీవు గురులక్ష్యముంచి నాసెలవడిగితివి కావున నిక చెప్పెద వినుము. దూషణ, భూషణ తిరస్కారములాత్మకు జెందవు. ఎందువలననందువా, దూషణ భూషణ తిరస్కారములు చేయువాడును, నయ్యవి పొందువాడను పరమాత్మయేకదా. "కించిదపి నద్వితీయోస్తి" కొంచెమయినను పరమాత్మకంటె నన్యములేదు, అని కదా బ్రహ్మవేత్తలు నిశ్చయించిరి. 'ఇక స్తోత్రము చేయువాడెవడు?

చేయబడువాడెవడు. అదేమియు నవసరము లేదు. ఇంకేదియైన వినవలసియున్న నడుగుము.

శిష్యు:- అనిత్యమగు నీస్థూల దేహముతో నిత్యమగు గురు తత్వమును గ్రహించి యెట్లు ప్రణమిల్లుదును?

గురు:- దాసూ! ఎముకలు, మాంసము. రక్తము, చర్మము, నరములు మొదలగు నీచ పదార్థములచేనైన వింతముద్ద ఈస్థూల శరీరము. ఇదిగాక సూక్ష్మ శరీరమనియు; కారణ శరీరమనియును రెండుగలవు. అవసరమగునేని ఈశరీరత్రయ లక్షణము వెనుక చెప్పెదుము. ఈస్థూల శరీరములో త్వక్కు, చక్షువులు, శ్రోత్రములు, జిహ్వ, నాశికము అను జ్ఞానేంద్రియములయిదును... వాక్కు, పాణి, పాద, పాయూపస్థలను కర్మేంద్రియములయిదును కలవు. ఈపదియింద్రియములు పది పనులయందు పరమాత్మ సన్నిధానమున వర్తింప సమర్థము లయియుండును. అయితే పరమాత్మ సన్నిధానమేనా. అది యేమి చేయదా అందువేమో, చేయదు. ఆత్మ, సాక్షి మాత్రమే, సూర్యోదయము కాగానే ప్రజలు వారిపనులను వారు చేసికొన నారంభింతురుకదా, వారితోకలసి సూర్య భగవానుడుకూడా పనిచేయుటలేదు. అట్లే ఆత్మ సన్నిధాన మున పాదములు నడువనేర్చును, చేతులు గ్రహింపనేర్చు. పాయూపస్థలు విసర్గానందముల నేర్చును. అదే మాదిరిగా స్వాధిష్ఠాన చిదాభాసుడగు జీవుడు జ్ఞానేంద్రియములవలన బయలుదేరి ప్రవృత్తులతోగలసి కన్నులతో చూచును. చెవు

లతో వినును. నాసికతో మూర్కొనును. నోటితో మాట్లా డును. నాలుకతో రుచులు గ్రహించును. ఇట్లు ఇంద్రియముల ద్వారా బహిః పదార్థములతో గలసి యా యా పనులను జేయించుచుండును. తానేమియు చలింపకుండు ట్లుకాదు. నోరే మాట్లాడును. కన్నులే చూచుచున్నవా. పీనుగునకు కన్నులు, నోరు, ముక్కులుండునుగదా. ఆయింద్రియములా పనుల జేయనోపును? ఓపవు గనుక ఈస్థూలశరీరముతో నీ కయ్యెడిదేమున్నది. యేమియులేదు. కాని సాధనమాత్రము. శ్రోత్రముకాని తదితరముకాని ప్రత్యక్ స్వరూపుడవు నీవు చేయవలసినదే అవి నీవు పొందవలసినదే. నీకంటె నన్యము లేదు, కావున నీవు నీకు నమస్కరించుకో వలసినదే ఇక నీకు వేరుగా సందేహమెందుకు?

శిష్యు:- అయ్యా! నాదమనగానేది. ఆనాదార్థమును సెలవిండు. గురు:- నాదమనగా శబ్దము. ధ్వని అది వేణునాదమని, శంఖ నాదమని, మృదంగ నాదమని అనేక సబంధములగు ధ్వనుల న్నియు నాదములేయనబడు... ఈనాదములన్నిటికిని జనక స్థానము ప్రణవనాదము. ఆప్రణవాక్షరమే పవన ఓం అనునది అది త్రిమాత్రోచ్చారణ కాలమాత్ర పరిమితి కలది కాని ప్రణవాక్షరము. నాలుగు పాదములు కలది ఆప్రణవాక్షరమే నిరాకార నిరంజన నిర్వికల్పాఖండ సచ్చిదానంద పరిపూర్ణా ద్వయ ప్రత్యక్చైతన్య పరబ్రహ్మము. ఆనాదోచ్చారణ కాల మును, నాదభేదమును, నాదవిలీనమును కొంచమయినను పెద్దలవలన గ్రహింపనేరక, పెద్దబాకా ఊదినట్లు ఓం ఓం ఓం

అనియఱచుట, ఎవరినో వంచించుటకును, బ్రహ్మవేత్తయని. లోకులు తన ననుకొనుటకు మాత్రమే యుపయోగపడును. అర్థమును గురుతించి యానందపూర్వకమగు స్థూలనాద మొనరించినను అది ప్రయోజనకారి కాకపోవచ్చును. క్షుదుప శమన కారియగునన్న స్మరణమున నాకలి తీరునా? జలస్మర ణమున తృష్ణ తీరునా? గనుక ముందు నాదవిమర్శచేసి తదర్థ మును గ్రహించి యనంతరము నాదానుసంధానము చేయ వలయును. నాదము ... బహిర్నాదమనియు, అంతర్నాద మనియు రెండు విధములుకలది. బహిర్నాదము ... ఓం అని పెద్దగా నెలుగించి యుచ్చరించుట. ఆ ప్రణవనాదము ...అకా రము, ఉకారము, మకారము అనుమూడక్షరాత్మకంబులగు మూడు పాదములుగలది అందు తురీయపాదము (నాల్గవ పాదము) యదార్థ పరబ్రహ్మస్వరూపములు. మొదటిది (అ) అవిద్యాపాదము, రెండవది (ఉ) అనునది ... వ్యష్టి సమష్టి రూపములగు సూక్ష్మ శరీరములును ఉభయ స్వప్నములు, తదవస్థాభిమానులగు జీవేశ్వరులను తెలిపెడి విద్యాపాదము మూడవది; మ ... అనునది మూడవయవస్థ. తదవస్థాభిమా నులగు ప్రాజ్ఞుడు అవ్యాకృతుడనగునానందపాదము. నాల్గవది ప్రత్యగ్బ్రహ్మము. ఈ యర్థమును భావనచేయుచు, మూలా ధారమునుండి నాదావతరణచేసి యానాదమును సహస్రా రకములో పరిభాగమునగల ఉన్మనియందు లీనముచేసినచో నది నాదాంతమగును. ఆనాదాంతమే బ్రహ్మము. ఓయీ గురువులు చెప్పినది చెప్పినట్లు నేర్చుట యుక్తలక్షణము. పరమేశ్వరుని యనుగ్రహమున నీకన్నియు తెలియగలవు.

శాంత చిత్తుడవై పోయి నీవు రచింపనున్న గ్రంథము నారభింపుము.

శిష్యు:- మహాప్రసాదము అని నమస్కరించి గురువుల యను మతిని వడసి గురువాక్యముల మహాభక్తిపూర్వకముగా మనన ము చేయుచు వచ్చి కావ్యమును వ్రాయనారంభించెను.

## 2. విన్నపము.

సోదరసోదరీమణులారా! ఇదిగో మీకు...

ఉ॥ విన్నపమాలకింప, బదివేల నమస్కృతులాచరింతు నే నెన్నడు గద్యపద్యముల నిమ్ముగ వ్రాయుటెఱుంగ నిందులో నున్నవి తప్పులెన్నో యవి యొప్పులుగా దిలకించి సత్కృపన్ నన్ను క్షమించి యిందుల గుణంబొకడుండినయేని గైకొనన్ మునుముందుగా పరమాత్మ స్వరూపుడగు సద్గురుమూర్తికి నమస్కరించి, పరమభాగవతోత్తములకును, కవిశ్రేష్ఠులకును, నాటకాలంకార సాహిత్య ధురంధరులకును, భక్తిపూర్వక దాసోహములు సమర్పించి, మీయాశీర్వచన పాత్రుడనగు నేను మీకందఱకు నొక్కమనవి చేయుచున్నాను. "అమృతం బాలభాషితం" అని లోకప్రసిద్ధికదా. చదువురాని కారణమున నారచనయు వచ్చిరాని మాటలతో రసభావ రహితములగు వాక్యప్రయోగములతో తప్పుల కుప్పగానుండుట నిజమని నాకు తెలిసియు, లోకము సంతోషించుపని నాతలపు సర్వాంతర్యామి, పరమేశ్వరుడు, పదింపదిగ నన్నుత్సాహపూరితుని గావించుచు వచ్చినందున, తప్పులుండునను భయ

మొప్పరికించి యిప్పట్టున నిష్పాత్తమును వ్రాయనుద్యోగించితిని. అంతియకాని యిదియొక వేదాంత ప్రబోధకమగు ప్రమాణ గ్రంథమనికాదు. శుద్ధబుద్ధ పరమాత్మస్వరూపంబులగు నుపనిషత్తులుండ, వ్యాసాదులు వాటికి భాష్యములు వ్రాయలేదా? భాష్యములుండగా అపరోక్షానుభూతి మొదలగు గ్రంథములుత్పిన్నములుకాలేదా? అవియుండ, భారత భాగవతాది గ్రంథములాంధ్రీకరింపబడి లోకమునకు మహోపకారము చేయుటలేదా? భక్తి జ్ఞాన వైరాగ్య పూరంబులగు తరంగంబులు ... అధ్యాత్మ రామాయణ కీర్తనలు, వేంకటాద్రి స్వాములవారి కీర్తనలు, తూము నృసింహాదాసు కీర్తనలు, రామదాసు కీర్తనలు, తండోపతండములుగా నేర్పడలేదా? "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనుమాటలు చాలవా? ఇన్ని వేదాంత గ్రంథములు అనగా వివేక చూడామణి, సర్వ వేదాంతసార సంగ్రహము ఆత్మబోధ మొదలగు గ్రంథములేల మహాత్ములు రచించిరి. మహాగ్రంథములవి యట్లుండగా "పోతుంది పోతుంది ఘటముపోతుందిరన్న" మొదలగు తత్వములువ్రాసినవారు మహాపండితులై వ్రాసిరా? వీనినన్నింటినిబట్టిచూడగా ప్రపంచజ్ఞానముగాని బ్రహ్మజ్ఞానముగాని జన్మాంతర పుణ్యాపరిపాకమున నెంతవఱకు తమకుపపన్నము కాగలదో అంతవఱకు తదానందమును తామనుభవించి తమకుగల యానందమును కవిత్వ రూపముచే ప్రపంచమునకు విరజల్లుట లోకస్వభావమని యూహింపక తప్పదు. గనుక పండితుడను గాకున్నను సద్గురుమూర్తి కటాక్షమున నాకు గలిగిన యానందమును నేనిట్లు లోకము

నకు వెల్లడించితిని. "అక్కా అక్కా, తోటకూర, తోటకూర" అని మనము నేర్పినమాటలు వినగోరి చిలుకతో పలికించి, యానందించినట్లు, మీరు నేర్చినవియు, వినినవియు నగు నానుడువుల నిరసింపక యొకతూరియైన నిష్పాత్రముగ జదివి, గుణమును మాత్రమే గ్రహించి, ఇట్టిరచనలకు నన్ను ప్రోత్సహింతురు గావుత మని వినయ పూర్వకముగా విన్న వించుకొనుచున్నాను.

ఇట్లు విధేయుడు,

దా సు.

# 3. దాసు జీవిత కథ.

ఓ నాప్రియ సోదరసోదరీమణులారా!

శ్రీభగవద్దాసదాసుండనగు నా కాపురము కృష్ణా జిల్లా నందిగామ తాలూకా అడవిరావులపాటి అగ్రహారము నాయది కాపుకులము. మాయింటి పేరు రాఘవాపురపువారు. నాజననీజనకులు శ్రీ లక్ష్మమ్మ, వెంకయ్య అను పుణ్యదంపతులు. నేను వారి సంతానములో జ్యేష్ఠుడను. నా పేరు తిరుపతయ్య. నా జననము 1922 అని మానాన్నగారు చెప్పుచుందురు. నా బాల్యము ... ఆరు ఏడు సంవత్సరముల ప్రాయ మెట్లు వెళ్లెనో నాకు స్మృహలో లేదు. ఎనిమదవ సంవత్సరము రాగానే భగవంతుడనువాడు రక్షకుడు కలడనియు, అతని భజించుట మహాపుణ్యమనియు నొకతలంపు తనంతట తానే గాఢముగా

గలిగి, నానాటికి భగవద్భక్తి యుగ్గలిమై, భగవన్నామ సంకీర్తనము చేయుచోటులకెల్ల పోయి వారితో శృతిరహితముగా వారితో బాడుచు లయవర్జితంబుగ చప్పటుల గొట్టుచు కాలము గడుపుచుంటిని. అంతట మా తండ్రిగారు నన్ను పశువుల మేపుకొనిరమ్మని కొంతకాలమును, మెల్ల మెల్లగా వ్యవసాయపు పనులలోనికి కొంతకాలమును పంపసాగిరి. ఈమధ్యమధ్య విశ్రాంతియున్నప్పుడెల్ల బడికిపోవుచు. క్రమక్రమమున తెలికపాఠములచదువునంతటిచదువునుమాత్ర మార్జింపనోచితిని. అప్పటికి ఇరువదిరెండు సంవత్సరముల వాడనైతిని. వివాహవయస్సు కలవాడనగుట గుర్తించి మా తండ్రిగారు ఆకుల చిన్న పిచ్చయ్య, లక్ష్మమ్మ అనువారి కుమారిత, సీతారత్నమ్మ అను యువతిని పెండ్లి చేసిరి. బహు పేద కుటుంబమగుటవలన, కుటుంబపోషణము చేయుట బహు కష్టసాధ్యమై, దినమొక యుగముగా దేహయాత్ర జరుపుచుండ, శ్రీరామచంద్రుని యనుగ్రహమున తుర్లపాటి రాజేశ్వరరావుగారిద్వారా మఱియెట్లో మాకుటుంబ చరిత్ర మెందుకో మఱి వేపుర్యాత్మ్మలో చెప్పగావిని, నందిగామ తహశీలుదారుగారు నన్ను పిలిపించి, యవ్యాజమగు కృపతో నాకు జవాను పదవినొసంగి, జాగ్రత్తగా నీపనిజూచుకొమ్మని తర్దరుయిచ్చిరి. ఆనాటికి నాసోదరులు పెద్దవారై తల్లిదండ్రుల బోషింపసమర్థులైరి. అప్పటికి నాకు సుఖజీవనమేర్పడి, వనితా కనకాదులయందు తీరని వాంఛకలిగి, యహర్నిశలు కామ రాగాదులకు దాసుడనై, కాలముగడుపుచుండగా; నొకసమయమున; నిర్నిమిత్తముగా గుండెలు ఝల్లుమని; ఓరి భగవా

నుడా! నేనిట్లు పశువులాగున నాహార, నిద్రా, మైథునాదులే చరితార్థములుగా సంచరించుచు, దురంత సంసారఘోరాగ్ని జ్వాలల మ్రగ్గిపోనుంటినే నాయుత్తరగతి యేమిచేయనుంటి వోకదా! ప్రభూ! దీనసంరక్షకా! ఆర్తత్రాణ పరాయణా! ఆపద్బాంధవా! అనాథనాథ సంరక్షకా! భయంకర సంసార సాగర యానపాత్రా సీతాకళత్రా! ఓరామా! అనంత కల్యాణ గుణధామా! అని శ్రీరామచంద్రప్రభు చరణారవిందముల స్మరించి, కన్నీరునించి, తనధనమంతయు దొంగలకర్పించిన మంథభాగ్యునిలాగున చాలసేపుపరితపించి, తపించి, నిదురపోగా, నాకొక స్వప్నము కలిగెను. నేనొకనాడేదో గ్రామమునకు నొంటిగాబోవుచు, దారితప్పి యొక భయంకరమగు నరణ్యములో ప్రవేశించి, నిర్జనంబును, నిర్జలంబును, కంటకపాషాణదుర్గంబగు నయ్యడవినిజూచి, భయమొందుచు, దిక్కులు పరికించుచు బోవుచుండ, పడగవిప్పి తననోటనుండి నిప్పులుమియుచు నొకకాలసర్పమువచ్చి, యమాంతము నా రెండుపాదములను బట్టుకొని మ్రింగనారంభించెను. నే నా దృశ్యమునకు భయంపడి కొంతతడవు నోటమాటయే రాక ఓరి బాబో, చచ్చితిని, చచ్చితినని గొంతుపెకలించుకొని కేకలు పెట్టితిని. వెంటనే నావెనుకనుండి; నేను వచ్చితిని భయపడకుము అనియెడి మనోహరమగు ధ్వని నావీనులంబడియెను. ఆహా! నాప్రాణదాత యెవరీపుణ్యాత్ముడని నేను వెనుకకు తిరిగి చూచునంతలో నక్కాలి సర్ప మదృశమయ్యెను. బ్రతుకు దేవుడాయని నేను మరల వెనుకకు తిరిగి చూచునప్పటికి నీలమేఘసుందరమగు శరీరములో మందహాస

చంద్రికల వెదజల్లుముద్దుమోము చందురినితో నిలచియున్న యొక మహాపురుషుండెను. మొలలోతు దుఃఖములో మోకాలిబంటి సంతోషమున్నట్లు, నాకాదుఃఖసమయములో సంతోషమును మహాశ్చర్యమునుకలిగి; యాదివ్యపురుషు నెట్లు పలుకరింపవలెనో, యేమనిధ్యానింపవలెనో తెలియక కర్తవ్య విమూఢుడనై త్రొట్రుపడుచుండ జూచి, కరుణామయుండగు నయ్యనఘుడు నన్నుజూచి; ఓయీ! భయపడకుము నేను సంసార భయవిరాముండనగు రాముండను, నీవు బహుజన్మల నుండి నన్ను సేవించుచు వచ్చుచున్న కారణమున నిప్పట్టున నీకు దర్శనమిచ్చితిని. నిష్కల్మష హృదయులగు వారికిగాని నాదర్శనము లభించదు. నన్ను సందర్శింప నోచినవారికి పునరావృత్తి రహితమగుట నిస్సందేహము. నీవు దురహంకారమును జేరనీక, స్నేహ ద్వేష కథలను పరిత్యజించి, వేష భాషలుమాని, సర్వదా ప్రభువు, భర్త, గతి, సాక్షి ఒకటి యననేటికి నన్నే యేలుగడగానమ్మి, వాచిక, కాయిక, మానసిక సపర్యలచే నన్నర్చింపుము అనతికాలంలో కృతార్థుడవగుదువని చెప్పి యంతర్ధానమునుపొందెను. నేనమ్మహాత్ముని మహోపదేశమునుగూర్చి చర్చించుకొనుచుండగా మెలకువవచ్చినది. వెంటనేలేచి, నాపాదములజూచుకొంటిని. పాదముల గంట్లుగాని రక్తముగానిలేదు. యప్పటియట్లున్నవి, ఔరా! యిది యెంతటి సుదినము. శ్రీరామచంద్రమూర్తి కలలోదర్శనమిచ్చి, తనసేవ నాకనుగ్రహించినాడని లోలోన మురియుచు, మరుదినముననే రామ లక్ష్మణ సీతా విగ్రహములచేయించి, నిత్యమును ధూప దీపనైవేద్యములొసంగుచు

ననంతరము నామ సంకీర్తనముజేయుచు, నుద్యోగమునకు భంగముకలుగనీయక, దుస్సహవాసములు, దుష్కార్యములు, దురాలోచనలు మాని, హృదయమున నిరంతరము రామ స్మరణ జేయుచు కాలమునుగడుపుచుండ, శ్రీరామభద్రుని యనుగ్రహమున నొకనాడు నిర్వ్యాజ కరుణాసముద్రుడగు శ్రీ అప్పస్వామి సాక్షాత్కరించి యాదరమున నన్ను జేరదీసి బహుజన్మ సమార్జిత వాసనా బీజంబులు దగ్ధంబులై పోవ హస్తమస్తక సంయోగంబుగావించి, తత్త్వోపదేశము చేసెను; నేను గురూపదిష్టమార్గమున జీవబ్రహ్మైక్యసంధానాభ్యాసము చేయుచు దృగ్దృశంబుల కభేదంబు జింతించుచు, నంతర్ముఖుండనై కాలముగడుపుచుండ 1950 వ సంవత్సరం జూన్ నాల్గవ తేదీన యేదేని వేదాంతగ్రంథ మొకండు రచియించు బుద్ధిని పరమాత్మకల్పించెను. వెంటనే తత్సన్నిధి బలంబున నాబుద్ధి: "ఓరి మంధభాగ్యుడా! నీవా వేదాంతగ్రంథములు వ్రాయువాడవు" "మహాగజాః పలాయంతేమశకానాంతు కాకథా" మహాపెద్దలైన పూర్వకాలపువారే ... దేహమే బ్రహ్మమని కొందఱు, ప్రాణమే బ్రహ్మమని మరికొందఱు, ఇంద్రియ సముదాయమే బ్రహ్మమని కొందఱు, అతిచంచలమయిన బుద్ధియే బ్రహ్మమనికొందఱు; కేవలము శూన్యమే బ్రహ్మమనికొందఱు; ఇవేవియు బ్రహ్మముకాదని తగ్గిసముగ్గిసలయిరి. ఓయీ! బ్రహ్మము నిందేదియని నిర్ధారణచేయనోవుదువు? నీవిచారణమైనను బోసినోటబెట్టిన చెఱకుముక్కవలెనిరర్థకమగును. నీవుమాత్రమిా వేదాంత గ్రంథరచనకు జూనకుము. అని నన్ను భాదింపసాగెను. నేనిదియంతయు

నొకనాడు మాగురుమూర్తికి నివేదించితిని. వెంటనే వారు నీకేమియు భయములేదు కవిత్వమనునది పూర్వజన్మకృత పుణ్యము... అన్నగారును వదినెగారు మిక్కిలిగారాబముతో తల్లిదండ్రిలేని బిడ్డడని పెంచుచుండగా జదువుసంధ్యలు లేక యథేచ్ఛగా తిరిగి తిరిగి తుదకు వెలయాండ్ర తళుకుబెళుకులకు మోసబోయి వదినెగారి నగలు సయితముదొంగిలించిన వేమన... శివగురు కటాక్షమునుపొంది పొందినవెంటనే చక్కనికవిత్వధోరణి కలిగి, తన్మూలమున దొంగగురువుల తలవాకిళ్లకు తాళములువేసి, జగద్విఖ్యాతిగల తత్వవేత్తయై తనజ్ఞానమున లోకమునకు మహోపకారమాచరించెను. నీవు సందేహింపవలదు. రచనకుపక్రమింపుమని యాదేశించెను. నేను గురువాక్యోల్లంఘనకు వెఱచి, నాయసమర్థతకు వెఱువక గ్రంథరచనకు దిగినాను. గనుక పాఠకులు నన్నుకరుణించి యీరచనయందేదియైన గుణముండినచో దానినే గ్రహించి యగుణంబులవిడచి, మరియొకగ్రంథము నెద్దానినైన వ్రాయుటకు ప్రోత్సహింతురుగావుతమని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

బుధవిధేయుడు,

**తిరుపతిదాసు.**

# నిత్య స్మరణీయ నామావళి.

1. శ్రీరామ శ్రీరామ । జయజయరామా ।
ఓరామ । ఓరామ ఓంకారధామా ।

2. రామలక్ష్మణ జానకీ । జైబోలో హనుమానుకీ ।

3. రాధారమణ । మదనమోహన । బృందావనలోల కృష్ణ॥

4. రామచంద్రా దీనబంధో । రక్షణసల్పుము
కరుణా సింధో॥
దేవ దేవా దీనబంధో। రక్షణసల్పుము కరుణాసింధో

5. హరిబోల్, హరిబోల్ హరి హరిబోల్
ముకుంద మాధవ గోవిందబోల్

6, హరేరామ హరేరామ। రామరామ హరే హరే, హరే
కృష్ణ. హరేకృష్ణ. కృష్ణకృష్ణ హరేహరే

7 శ్రీకృష్ణగోవిందహరే మురారే । హేనాధనారాయణ
వాసుదేవా॥

8. అచ్యుతం కేశవం । రామనారాయణం । కృష్ణదామోదరం
వాసుదేవం హరిం శ్రీధరం మాధవం । గోపికావల్లభం
జానకీ నాయకం । రామచంద్రంభజే॥

9. జైజైసీతారాం । జైజై రఘురాం । జైజై దశరథరాం।
జైజై కల్యాణరాం॥

# భోదానందలహరి

## ప్రారంభము.

శ్లో॥ దయాకరం మహాశాంతం । ప్రసన్నవదనాంబుజం ।
సత్యజ్ఞాన సుధాంభోదిం । వందేహం గురునాయకం॥

## వినాయక స్తుతి.

కం॥ ఇల భక్తులకృత్యంబుల నలఘు కృపంబూర్తి జేయు
నభవు తనూజుం । దలచెదమత్పంకల్పితముల నిర్వి
ఘ్నముగ గూర్పమ్రొక్కెచనిశమున్.

## సరస్వతీ స్తవము,

కం॥ వాణీ పల్లవకోమల పాణీ జీమూతవేణి । పద్మజురాణీ
గాణేయ సకలసుగుణ శ్రేణీ సురవినుత సుప్రసిద్ధపురాణీ.

## సంస్కృతాంధ్ర కవి స్తుతి.

సీ॥ ఆదిమ కవితా ధనాఢ్యుడగునాకు
భవుకీర్తి మహిమంబు ప్రస్తుతించి
సంస్కృత కవితా విశారదులగు కాళి
దాసాది కవుల గీర్తనము సలిపి

ఆంధ్రభాషాభోషకమిత సుందరత గూర్చిన
నన్నయాదుల ఘనత బొగడి
నూతనకవిజన వ్రాతాగ్రగణ్యులౌ
తిరుపతి వేంకటేశ్వరుల దలచి

ఆ॥వె॥ తెలుగు దేశమునకు వెలుగు
తెలుగు బాసకు వన్నె చిన్నెలలవరించియున్న
ఘనుల నెల్ల లోదలంచి యేను భోదానంద
లహరి వ్రాయుటకు జెలంగినాడ.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# దాసు సదుపదేశము.

సోదరులారా!

మనకు పూర్వజన్మములందేజన్మయం దేనాడు చేసిన మహాపుణ్యవశముననో యీమనుష్య జన్మము సంప్రాప్తమయినది. మనమజ్ఞులమై యీజన్మమును దుర్వినియోగము చేసితిమేని యింకెప్పటికి యీ మానుష జన్మము కలుగునో తెలియకుండుటే గాక, అనేక దుఃఖపరంపరల పాలగుదుము. గనుక ప్రతిమానవుడును దీపముండగనే వెదుకనగునన్న లోకసామెత ననుసరించి, మనకు మరల మానవత్వము కలుగునో కలుగదో యను భయమును లోనుంచుకొని శరీరము జరాగ్రస్తము కాకపూర్వమే, ... ముందుగా పుణ్యకార్యాచరణమునకు దిగవలెను. అవి యేవియందురేమో: ...దైవచింతనము; దైవభక్తి; సజ్జనసాంగత్యము;

సాధుసేవ; భగవద్గీతాపారాయణ; సహస్రనామస్తోత్రపారాయణ; నామసంకీర్తన; భగవతారాధన: భగవత్కథాశ్రవణము మొదలగువానిచే కాలమును గడుపుచు; అన్నమును యాచించువారికి తనశక్తికొలది సమర్పించుచు, పాపకృత్యములకు పాల్పడక, పాపకృత్యముల లోనైన దలంపక, తెలిసినంతవఱకైనను వేదాంత శ్రవణము చేయుచు, శరీరమందు నిత్యత్వ బుద్ధి కలిగి సంచరించుచుండవలెను. ఇట్లెంత జాగ్రతగా కాలముగడుపుచున్నను మనకు ప్రత్యహమును తెలియకుండ కొన్ని పాపములు సంభవించుచున్నవి. ఆపాపములెవ్వియన...1 ఱోలునలననొకపాపము 2. సన్నికలు 3. ప్రొయ్యి 4. నీళ్లకడవ 5. మార్జని ... చీపురు యీ అయిదింటివలన మనకు తెలియని పాపములు సంభవించును. ఆ పాపసందర్భములను గురించి శ్రీమళయాళస్వాములవారు తమచే రచింపబడిన శుష్కవేదాంత తమోభాస్కరమను గ్రంథములో వ్రాసియుండిరి. చూచుకొనవచ్చును. ఈ పాపములయిదును శమించుటకు వైదుయజ్ఞములు చెప్పిరి. ఆ పంచయజ్ఞ విధానముకూడ స్వామివారి గ్రంథములో విశదీకరించియున్నది. గ్రంథవిస్తర భయమున నేను వ్రాయ నుజ్జగించితిని. మఱియు మానవుడనగా, చచ్చువాడని యర్థము.... అనిత్యముగల శరీరము కలవాడని భావింపవలయును. మానవునకునూఱేండ్లు ఆయుః ప్రమాణమని చెప్పుదురు. అట్లు వేదశాస్త్రము లేకారణమున నిర్వచించినవో అస్మదాదులకు దురూహ్యము. కావున "శరీరం కర్మసంచితం" అందురుకదా. ఒకానొకదేవదైన కర్మరూపమగు ప్రారబ్ధ శేషానుభవమునకై బ్రతికిన

నూరేండ్లు బ్రతుకవచ్చును. అంతేగాని యీమాయాకల్పిత దేహ మేర్పడక మున్నే, తల్లి గర్భములోనుండి పతనమై పోవచ్చును. కొన్ని దేహములావనాడే, కొన్ని భూపతనము కాగానే, కాల నియమములు లేకుండ నశించిపోవుట, పిన్న పెద్దలందఱకును విదితము కానిదికాదు. ఈ శరీరము పుట్టుకతోనే దేవఋణము, పితృఋణము, ఋషిఋణము అను మూడు ఋణములుకలవాడై జనించును గావున, ముముక్షుత్వపు మాటయెట్లున్నను, పశువుగాక, మానవుడై పుట్టినందున నించుక పుణ్యమయినను సంపాదింపనిచో, వాని జన్మము నర జన్మమనరాదు. ఆ పుణ్యములలో నేపుణ్యమెట్లుపోయినను, దేవయజనమును భక్తిపూర్వకము చేసి ఫలము నపేక్షింపకుండుటవలన దేవఋణ విముక్తియగును. అమావాస్యలయందును, దక్షిణోత్తరాయణములందు, సూర్య చంద్ర గ్రహణ కాలములయందును, గంగా గోదావరీ, కృష్ణవేణి తుంగభద్రాది మహాపుణ్య నదీదర్శనములయందును, తత్పుష్కర కాలములందును, మహాలయములయందును, పితృదేవతలనుద్దేశించి, స్నాన, దాన, తర్పణాదులాచరించుట; తల్లిదండ్రుల మృతదినములయందు వారి నుద్దేశించి, ప్రత్యాబ్దికములు జరుపుట. సత్పాత్రుడగుకుమారుని తనధర్మపత్నియందు విధ్యుక్తముగా గనుట మొదలగు కృత్యములతో పితృఋణముతీరును. వేదవేదాంగముల విధ్యుక్తముగాసద్గురువు యొద్ద జదివి, క్రమంబున తద్విహితకర్మల నాచరింప నర్హాంబులగు నాశ్రమంబుల స్వీకరించి, నియమితులై జితేంద్రియులై, తపోనిష్ఠా గరిష్ఠులై, శాస్త్ర పరి

శోధనచేసి లోక సముద్ధరణ పండితులై వారు నియమించిన ప్రకారము కల్మష రహితమనస్కులై యాయా కాలముల తదాజ్ఞానుసార సమర్థంబులగు బ్రహ్మచర్యాద్యాశ్రమంబుల స్వీకరించి, ఫలవాంఛా భావముగ తదుచితంబులగు కర్మల నాచరించి, మహాత్ములు వారు నిర్ణయించినట్లు, సాధు సంచారము చేయుచు, అర్థంబులగు కర్మలవిడువక, యనర్థంబులగు కర్మలవిడచి, సమత్వబుద్ధి కలిగి, భగవదర్చన, భగవద్ధ్యాన, భగవత్కథాశ్రవణ, భగవద్గీతాపారాయణ, దేవతా సహస్రనామ స్తోత్ర పారాయణ, భగవత్ భక్తాంఘ్రిని షేవణ మొదలగు సత్కృత్యములతో కాలముగడుపుట మున్నగు వానితో ఋషిఋణ విముక్తుడగును. ఈ ఋణత్రయ విముక్తి జెందిన బుద్ధిమంతునకే క్రమంబున హృదయమునగల యజ్ఞానాంధకారము నశింప పరోక్ష జ్ఞాన భానూదయమగును.

సోదరులారా!

ఇవియంతయు కర్మకాండ. దీనివలన నంతఃకరణ పారిశుద్ధ్య మేర్పడును. అంతఃకరణ మాలిన్యము నశించినది మొదలు మెల్లమెల్లగా ముముక్షుత్వముదయించును. ముముక్షుత్వము కలుగగా సద్గురులాభ మొదవును. సద్గురులాభమున మోక్షము సిద్ధించును. ముక్తికి కర్మలు ప్రయోజనకరములు గావు గాని చిత్తశుద్ధికి మాత్రమే కారణమగును. "జ్ఞానాదేవతుకైవల్యం" అని శ్రుతులు చెప్పిన కారణమున నొక జ్ఞానమే ముక్తికి కారణముగాని యితరము లేవియుగావు. ఒక వస్తువును చూచుటకు కన్నులితర కర్మసహాయముల నెట్ల

పేక్షింపవో, వస్తుసందర్శనమునందు శ్రవణాదులవలన గలిగిన జ్ఞానముకూడ మరియొక సహాయము నట్లపేక్షింపదు. అట్టి జ్ఞానము ముముక్షువులకేగాని కర్మయోగులకు లభించదు. ఆ ముముక్షువులుకూడ విమర్శింప దగినవారై యుందురు. ఏలయన ముముక్షువనగా మోక్షేచ్ఛగలవాడని యర్థము. మోక్ష మొకటేకదా. దానినికోరువారందఱును ముముక్షువులే కదా. అని మీరడుగవచ్చును. ఆ ముముక్షువులలో నొకడు కేవలమోక్షమునే కోరియుండను. మఱియొకడు ముముక్షువులాగునటించి, వేదాంతమును గ్రహించి, గురుత్వమును సంపాదించి, ప్రసిద్ధి గణింపగోరియుండును. మఱియొకడు గౌరవము నార్జింపగోరియుండును మఱియొకడు వేదాంతములోని రహస్యమెఱింగి, దానిని విపరీతార్థముచేసి పెద్దల నగతాళి చేయదలంచియుండును. గావున పైనచెప్పిన నాలుగు తెగల ముముక్షువులలో మోక్షేచ్ఛగలవాడే తరించునుగాని తక్కుంగల మువ్వురు నరకగాములేయగుదురు. తీవ్రముముక్షువు ... లక్షణమెట్లుండ వలయునన్న: నొకని యింటిలోబెట్టి తలుపులు బిగించి యింటికి నిప్పు పెట్టగా, నిల్లు తగులబడుచుండ నింటిలోనుండి, నన్నీసమయమున రక్షించు వారెవరని యల్లాడుచు, స్వరక్షణ మపేక్షించువాని లాగున అతి భయంకర సంసార దావాగ్ని జ్వాలామాలికలు తన్నలమి దహించుచుండ, ఈ సంసార దావాగ్ని చల్లారుట యెట్లు, నాకు జ్ఞానోపదేశముచేసి చిత్తశాంతి యొనగూర్చు మహాత్ములెచట లభింతురని ముక్తినపేక్షించి, భార్యాపుత్రాదులపై గల మమతాంధకారమునుండి వెలువడి, దేహేంద్రి

యాద్యభిమాన వర్జితుడై, స్వర్గసుఖమునుగూడ నిరసించి, సద్గురుచరణముల నాశ్రయించి తదుపదిష్టమార్గము నవలంబించి చరితార్థుడు కావలెను. అయితే ... భక్తి నిరర్థకమేనా యని మీరడుగవచ్చును. భక్తి నిరర్థకమని నేననజాలను. జ్ఞానవిహీనుడు నూరు జన్మలెత్తియును ముక్తిని పొందజాలడని భగవద్పాదాచార్యులుగ్గడించినారు. అనగా పునరావృత్తి రహితమగు ముక్తిని పొందుటకు భగవద్భక్తి సమర్థముకాక పోవచ్చును. కాని నేను వెనుక జెప్పియున్న చతుర్విధ ముక్తులను వారివారి తారతమ్యము ననుసరించి పొందనోపుదురు. తరువాత నాయా దేవతల ననన్య భక్తి నుపాసించు పుణ్యాత్ములు తద్దేవతావతార సమాప్తి కాలమున వారితోగూడ ముక్తి పొందుదురు. జ్ఞాన సంపన్నులయ్యును, ప్రహ్లాదుడు మున్నగువారు .. అనగా ... ప్రహ్లాదుడు, నారదుడు, పరాశరుడు, పుండరీకుడు, వ్యాసుడు, అంబరీషుడు, శుకుడు, శౌనకుడు, భీష్ముడు, రుక్మాంగదుడు, దాల్భ్యుడు, విభీషణుడు అర్జునుడు, మొదలగు మహామహులు ఏకాంత భక్తులై, తమకు, భగవానునకు, పరమాత్మకు, అభేదైక్యానుసంధానము జేయుచు, భక్తిమయ కారణముగా, కృష్ణపరమాత్మను భజించు ముక్తులైరి. కావుననే భక్తియోగము జ్ఞానయోగమునకు సన్నిహితమగుచున్నది. గనుకనే ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని ఈ నలువురు నన్ను భజింతురని భగవానుడు వాక్రుచ్చినాడు. దేనినిబట్టి చూచినను జ్ఞానమే మోక్షసాధనము. ... సాధన మనుట యేమిటి?

"జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ విహీనం । జ్ఞాతురభిన్నం । జ్ఞానమఖండం" అని చెప్పినందున అఖండజ్ఞానమే తత్వము దీని కణుమాత్రమయినను సందేహము లేదు. అట్టి పరిశుద్ధజ్ఞానము విచారణవలనను శ్రవణమువలనను కలుగవలసిన దేగాని విగ్రహారాధనలతోను, జనరంజకమునకై చేయు భజనలతోను, సప్తాహములతోను...నగరసంకీర్తనలతోను దొంగ వేషభాషలతోను కలుగదు, "వజ్రంవజ్రేణబిద్యవి" అనగా వజ్రమునువజ్రమే భేదింపవలెను ... అన్నట్లు సాధనాంతరాపేక్షలేని నిష్కళమగు బ్రహ్మమును సాధనాంతరాపేక్షలేనిజ్ఞానమేపొందించును... వేదాంతవిచారణయందురుగాని వేదాంత పూజయని మోరకులుగూడ వచియింపరుగదా. అట్టి సర్వోత్కృష్టమగు జ్ఞానము లేనివారికి, దానిలక్షణమే యెఱుంగనివారికి దేహేంద్రియాదులందాత్మ బుద్ధిగలవారికి, వేదము కర్మోపదేశము చేసినది. సర్వజ్ఞుడగు భగవానుడట్టి మూఢులు సత్కర్మానుష్ఠానమునకు, జ్ఞానమునకుకూడ చెడిపోవుదురని యనుగ్రహించి,... కర్మసంగులగు నజ్ఞులకు బుద్ధిభేదము జనియింపజేయగూడదని యాజ్ఞ యిచ్చినాడు.

ఆర్యులారా!

సర్వజ్ఞత్వము భగవానునకును తరువాత తదనుగ్రహపాత్రులగు పెద్దలకు గలదు. కాని యుబుసుపోక పూరకొనలేక తెలిసియో, తెలియకో; తెలిసినంతవఱకో యేవో నేనుపన్యసించిన యోగములలో జ్ఞానయోగము ముఖ్యమైనదయినను

తక్కినకర్మయోగము భక్తియోగముకూడ ననుష్ఠేయములే. అట్లు కానియెడల రెంటికి చెడిన రేవనిచందము వాటిల్లును. కర్మలుగాని భక్తిగాని తామసరాజస వృత్తులతో జేయగూడదు...సాత్వికవృత్తి విరచితములు గానికర్మలు. ఫలవంతములయ్యును నిరర్థకములగును... తమోవృత్తిచే జన్మము చేసి త్రిశిరునిగని వానిమూలమున నేమి యనుభవించెను;. రావణుడభిచార హోమము నుపక్రమించి యేమిఫలమనుభవించెను; హిరణ్యాక్ష హిరణ్యకశిపులులోకము నంతయు జయింపనెంచి వరములు వడసి; యేమయిరి గనుక తామస రాజస తపస్సులుగాని కర్మలుగాని ఫలవంతములుగా దోచునను నిష్ప్రయోజన ములగును... కావున సాత్వికములగు భగవత్కైంకర్యముల జేయుచు నవి భగవదర్పణ మొనరించుచురాగా రాగా ననేక జన్మముల కడపట జీవబ్రహ్మైక్య జ్ఞానము లభించగలదు..."జన్మనామపిసర్వేషాం మానుషం జన్మదుస్తరం" అన్ని జన్మలలోనికి మానుషం చాల దుస్తరమయినది. అట్టి దుస్తరమగు మనుష్య జన్మగాంచి కాలము వృథాచేయుట, మేతమేయునగు కాలములో నెమరువేయుచు పరుండిన దుక్కిటెద్దులాగున చెడుటయగును.జ్ఞానము దుర్లభమని కొందఱికి తోచవచ్చును. అట్టి వారుకూడ భగవతారాధన భగవద్భజన, భగవన్నామ సంకీర్తన. మొదలగునవి శ్రద్ధాభక్తులతో చేసిన యెడల జన్మ పరంపరల యందైనభగవదను గ్రహమున జ్ఞాన సంపన్నులై విముక్తిని పొందుదురు.

# ప్రశ్నోత్తరము ౹౦.

ప్రశ్న-- దేవా! ఈసంసారభారము నా నాటికి పెచ్చుపెరిగి నా నెత్తినబడుచున్నది, దింపుకొనుటకు నేనసమర్ధుడనైతిని, సరిగా. దీనిని అనగా నీసంసారభారమును దించువారైన గను బడుటలేదే. నే నేమి చేయుదును-

ఉ॥ వెఱ్ఱివాడ ఎవరయిన నలువురుబట్టి ఈభారమును బలవంతముగా నీ నెత్తిన బెట్టి యున్నయడల మరియన్యులు దింపనో పుదురు అంతియగాక తెలివి లేమిచే మోయరాని బరువని యేమియు లేని యుళక్కి మూటబరువుగా నున్నదని వెలుపలను లోపలను గూడ నాకార శూన్యుడ వగు నీవు వేదనబడువాని లాగున నాటక మాడుచున్నావు-. ఈ సంసార భారమును తెలివిమాలి నీవేయెత్తు కొంటివి. తెలివిగలిగి నీవే దింపుకొనుము....మఱియొకరి వలన కాదగిన పనికాదిది....

ప్రశ్న..., ఎవరును దింపలేని యీ సంసారము నాకేల కలిగినది?

ఉ॥ ఏల కలిగినదా? కడగా పొయ్యే కర్మమూ కాలిమీదిగా పొమ్మని కోరగా కలిగినది. ముందు నీవెఱ్ఱివాడవో గురుతింప జాలుదువేని ఈ సంసారమునకును నీకును గలసంబంధమును గురుతింపగలుగుదువు. నిత్యుడవు, నిర్మలుడవు, నిష్కళంకుడవు, నిరాశ్రయుడవు, నిర్లేపకుడవు; నిరాకారుడవు; నిరీహుడవు ... నీవు బ్రహ్మమవు. అట్టి నీకు అధిష్ఠానా జ్ఞానము వలన దేహాత్మ భ్రాంతి యేర్పడి; మమకాహాంకారములకు

లోనై క్రమక్రమమున స్వస్వరూపమును మఱచి; సంసారాంధకూపమునబడి; క్రుంగులిడుచు; నేనాటికిని పారము గానలేక నాది నాదియను మోహజాలమున జిక్కువడితివి.

“యజ్జాయతేవస్తు । తదేవవర్ధతే । తదేవమృత్యుం । సముపైతికాలే” ఏవస్తువు పుట్టుచున్నదో అదే వృద్ధిపొందుచున్నది, ఆదేకాలముతీరినపుడు మృత్యువునుపొందుచున్నది. అను విషయమును తెలియక నిన్నాశ్రయించుకొనియున్నట్లున్న వారినందఱిని నేనే పోషించుచున్నాననియు; వీరందఱికి నేనే రక్షకుడననియు; నీకు సంబంధింపని యహంకర్తృత్వావా గురుల మెడకు వేసికొని, ఇంటిలో నెవరికి యించుక యస్వస్థత యేర్పడినను స్నానము, జపము మున్నగునవి మాని వైద్యుల యింటి చుట్టు తిరుగుచు మందులకై యాటు నిటు పరుగిడుచు. నిద్రాహారములు మాని రోగ పీడితులగు భార్యా పుత్రాదుల కంటె నూరు రెట్లు బాధ పడుదువు కదా! నిన్నా బాధ పడుమని యెవరుపదేశించిరి?

వారిశరీరములారోగ్య వంతములయ్యేనేని యానందింతువు, పతనము లయ్యేనేని, గోలపెట్టి యేడ్తువు చూచువారు నిజముగా నీవారే యయినేని నిన్ను విడచి వారెట్లు పోగలరు” “కాతే కాంతా” కస్తే పుత్రః” నీ పెండ్లా ‘మెవతె’ నీ కొడు కెవడు, అని భగవత్పాదా చార్యులని యుండరేమో అనగా నిత్య పరిపూర్ణ, అఖండాద్వయ సచ్చిదానంద పర బ్రహ్మము నిబిడమై బహిరంత రాళంబులను భేదమును

లేకుండ నిండి యుండగా, భార్య, పుత్రుడు తండ్రి, మొద లగు నానా భేదరూపములు భిన్ననామములు...ప్రియా ప్రియము లెక్కడి నుండి వచ్చినవి? ఇట్టిది అట్టిది అని చెప్ప టకలవిగాని అనాద్యజ్ఞానము వలన వచ్చినవి. అజ్ఞానము వలన అవివేకము వచ్చినది. అయ్యవివేకము వలన దేహా ద్యభిమానము వచ్చినది అయ్యభిమానమువలన రాగద్వేషా దులు బయలుదేరినవి. రాగద్వేషాదుల మూలమున కర్మము సంభవించినది. కర్మ మూలమున శరీరము వచ్చినది. శరీర మూలమున దుఃఖము సంభవించినది. అట్లయిన దుఃఖమునకు అంతము లేదాయని మీరడుగవచ్చును, దుఃఖము శరీరము పోయినచో బోవును. శరీర మెట్లు పోవునన, కర్మ, పోయి నచో బోవును. కర్మ, యెట్లు పోవునన రాగ ద్వేషాదులు పోయిన కర్మ, పోవును, 'రాగద్వేషాదు లెట్లు పోవునన' నభిమానము పోయిన రాగాదులు పోవును అభిమాన మెట్లు పోవునన నవివేకము పోయిన పోవును, అవివేక మెట్లు పోవునన నధిష్ఠానాజ్ఞానము పోయిన పోవును. అయ్య జ్ఞానమెట్లు పోవునన బ్రహ్మజ్ఞానము కలిగిన నజ్ఞానము పోవును, ఓయీ విద్వాంసా! ఇప్పుడు నేను జెప్పిన వానిలో బ్రహ్మ మొక్కండు తక్క తదితరంబు లన్నియు నశ్వర ములు, దుఃఖ మయంబులు దుఃఖ మయ మగునదియే సం సారము. ఈసంసారము గాఢమగుటయే భారము, ఈసంసా రభారమును నీ నెత్తినుండిదింపు వారెవరునులేరు. గురువులు సంసార భారమును మాన్ప జాలరా యందువేమో అట్ల యినను గురూపదిష్ట మార్గము నవలంబించి యాత్మ

బంధుత్వమును సంపాదించుకొనువాడవు నీవే కదా, అది గురువు లుపదేశింతురు గాని నీవై వర్తింతురా?

అందుకనియే'' యనరి యాత్మను వారే యుద్ధరించుకొనవలె ననియు 'తన యాత్మను తానుద్ధరించుకొన్నవారి కాత్మ బంధు వగుననియు; నుద్ధరించుకొనని వారికి తన యాత్మయే శత్రు వగుననియు. భగవాను డుగ్గడించినాడు, గనుక నీభారము. నీవే దింపుకొనవలెను, చేయగలిగితివేని నేనొకటి చెప్పెదను విను...

నాకు దేహేంద్రియాది బుద్ధియోగము లేదు... నాకు పుణ్యము లేదు నాకు పాపము లేదు, నాకు షడూర్మలు లేవు, నాకు వికారములు లేవు. నేను కేవలుడను సచ్చిదా నందాఖండా ద్వితీయ ప్రత్యగాత్మను'' అని కూర్చొనుము...నీ నెత్తి మీది యబద్ధాల మూట మటుమాయమై పోవును...అట్లుతలంపక యజ్ఞానమున నేను భారకుడనని కర్తృత్వము వహింతువా నీవీ మాయదారి మూట క్రింద, నణగారి పోవుదువు 'ఇట్టి మూటలు లక్షలు కోట్లు నీ నెత్తిన బడును.

## కర్త విచారము.

ప్రశ్న...కర్మ లెన్ని విధములు? వాని వలన కలుగు ఫలాఫలంబు లెవ్వి?...

ఉత్తరము...కర్మలు, మూడు విధములని పెద్దలు చెప్పుదురు అవి. ౧ పుణ్యకర్మ ౨ పాపకర్మ ౩ మిశ్రమకర్మ ఈమూడు, నొక్కొక్కటి మూడు విధములుగా గలది అవి యెవ్వియన పుణ్యోత్కృష్టము. పుణ్య మధ్యమము, పుణ్యాధమము, పాపోత్కృష్టము, పాపమధ్యమము పాపాధమము మిశ్రోత్కృష్టము మిశ్ర మధ్యమము మిశ్రాధమము పుణ్యకర్మవలన దేవత్వము కలుగును. పాపకర్మవలన పశుపక్ష్యాది దేహములు ప్రాప్తించును మిశ్రమ కర్మవలన మానుష దేహప్రాప్తి కలుగును. పుణ్యాధికమున.. బ్రహ్మ శరీర ప్రాప్తి కలుగును పుణ్యమధ్యమమున నింద్రుడు మొదలగు శరీర ప్రాప్తి కలుగును పుణ్య సామాన్యమున యక్ష రక్షశ్శరీరములు కలుగును. పాపాధిక కర్మవలన నితర ప్రాణి బాధకములగు పాములు, తేళ్లు, మండ్రగబ్బలు, పేలు, నల్లులు, అడవియీగలు మొదలగు శరీరములు ప్రాప్తించును. పాపమధ్యమునకు చింత, పనస, నారికేళ, జంబు, జంబీర, మహిష సైరిభాదిశరీరములు ప్రాప్తించును.

పాపసామాన్యంబునకు ఆవులు, ఏనుగులు, బిల్వాశ్వర్థ పలాశాది శరీరములు ప్రాప్తించును. మిశ్రోత్కృరంబున ఫలాకాంక్ష రహితములగు కర్మలనుజేసి తద్వారా చిత్తశుద్ధి కలిగి, దానివలన శమదమాది సంపత్తి కలిగి, సద్గురువుల నాశ్రయించి వారి యనుగ్రహమును పొంది శ్రవణ మనన నిధిధ్యాసల పూర్ణముగా సలిపి జీవన్ముక్తి బొందదగు శరీరములు ప్రాప్తించును. మిశ్రమ మధ్యమమున తమకుచిత

ములగు కర్మల ననుష్ఠించు శరీరములు ప్రాప్తించును. మిశ్ర సామాన్యమున కిరాత పుల్కస బురుడు కాది శరీరములు ప్రాప్తించును. మానవుడై జనించినాడు గనుక వివేకము గలవాడై సర్వవిధముల ప్రయత్నించి, మిశ్రోత్కృష్ట కర్మ ములయినను చేయవలయును. అయితే ఈ కర్మలెవరిచే చేయబడు చున్నవని మీరడుగ వచ్చును, మనస్సు, నోరు శరీరము ఈమూటి చేతనే పుణ్య పాప మిశ్రకర్మలు చేయ బడుచున్నవి. మనస్సేమి చేయునందురా? ఎప్పుడును పర లోకచింతయు పరోపకార చింతయు, భగవద్ధ్యాన చింతయు మొదలగునవి మనస్సుచే, చేయబడిన పుణ్యకర్మలు. అహో రాత్రమును. విషయ చింతయు, పరాపకార చింతయు ధర్మమును, వేదమును, శాస్త్రమును, పెద్దలను వంచింప నెంచుటయు, నివి మనస్సు చేసిన పాపములు... జపము చేసికొనుచు, భగవతారాధన జేయుచు. విషయములను చింతించుట మనస్సు చేసిన మిశ్రమ "కర్మ" భగవద్ధ్యానము చేయుట గీతాపారాయణము చేయుట, భగవన్నామ సంకీర్తనము చేయుట శివ విష్ణు దేవీ సహస్రనామ స్తోత్ర మును పఠించుట యను నివి నోరుచేసిన పుణ్యములు. వేదము లబద్ధములని యుపన్యసించుట. పరమ భాగవతుల నిందించుట అబద్ధములాడుట పరులనుపరుషములాడుట మొదలగునవి నోరు చేసినపాపములు జపానుష్ఠాన కాలము నందును, వేదాధ్య యన కాలము నందను అవి నిలిపి లోక వ్యవహారముల నుచ్చరించుట, ప్రమాణములు చేయుట, ఇవి నోరుచేసిన మిశ్రకర్మలు... పుణ్య తీర్థములకు బోవుటయు. నితరుల

కాపదలు గలిగిన సమయమున వారికి వలసిన సహాయము లొసరించుట దేవతా దర్శనంబుల కేగుటయు, గురు దేవతా నమస్కారము లాచరించుటయు మొదలగునవి శరీరము చేసిన పుణ్యములు. గురు దేవతలకు, నమస్కరింప కుండుటయు, పరులకు హాని కలుగు పనులు చేయుటయు, పర ధనముల దొంగిలించుటయు. పర స్త్రీసంగమము చేయు టయు నివి శరీరము చేసిన పాపములు... సత్రములబడ కొట్టి దేవలంబులు గట్టించుటయు, చెరువులు పూడ్పించి బీదలకు సేద్యము చేసికొన నిచ్చుటయు; సాధువులకు భోజన సౌకర్య మేర్పరచుటకు సాధువుల యాచించుటయు మొదలగునవి శరీరము చేసిన మిశ్ర కర్మములు. ఈ పనులు త్రికరణములు చేయును. గాని యీపనులు గాని పనుల వలన గలుగు ఫలముకాని సాక్షివి గాన నీకేమియు నవ సరము లేదు...

ప్రశ్న–...సాక్షిత్వము నాకు కలదనుట యెట్లు?

ఉత్త–...చెప్పెదను వినుము...

ఒక విజనస్థలము నందు మువ్వురు కూర్చొని జపము చేసి కొను చుండిరి కొంత తడవయిన తరువాత నందులో నొక డొకనిని పేరబిలచి యేమోయి రెండు మాసములలో నిచ్చెదనని చెప్పి నాయొద్ద డబ్బు తీసికొని పోయితివి రెండు సంవత్సరము లయినది. నా పయిక మింక నెన్నడీ దలంచి యుంటివని యడిగెను. అది విని అప్పు పుచ్చుకొన్న వాడు నేను నీ బాకీ యియ్య లేననెను. ఆ మాటలు విని

వారిరువురు కొంతసేపు మెల్ల మెల్లగా మాట్లాడి కొని తరువాత పెద్ద వివాద పడి. తుదకు వారిరువురును కొట్టుకొని అప్పిచ్చినవాడు న్యాయాధికారివద్ద ఫిర్యాదు చేసెను. ఆ న్యాయాధికారి యిరువురను రప్పించి విచారింపగా ఋణమియ్యవలసినవాడు, అయ్యా నన్నతడే నిర్నిమిత్తముగా పైబడి కొట్టె. తనతప్పు కప్పిపుచ్చుకొనుటకై నామీద నభియోగము తెచ్చినాడని చెప్పుకొనగా, న్యాయాధికారి మీ యిరువురకు సాక్ష్యమేమైన కలదాయని యడిగెను. వారు తాము కలహించునప్పుడూరక తమయొద్ద కూర్చునియున్న వానిం జెప్పిరి ఆ సాక్షికి గల లక్షణములే యీ సాక్షియగు పరమాత్మకున్నవి. ఏవవి యందువా? వారు మానసిక, వాచిక, కాయికములతో కలహించునప్పుడీ సాక్షి సన్నిహితుడై యుండెనే గాని యేవిధములో కూడ నతడేమియు పలుకలేదు. ఆ మూలాగ్రము వారికలహామును నెఱుంగకుండ లేదు. దీనిని బట్టి జూడ సర్వమును. అనగా త్రికరణముల చేత సర్వ కర్మలు జేయు బడుచున్న వనియు సాక్షి యగువాడు సర్వము చూచు వాడే గాని వానికి తర సంబంధము లేదనియు తేలుచున్నది గనుక. బ్రహ్మము పాపపుణ్య మిశ్రకర్మలను చేయువాడు కాదు. వాని ఫలము ననుభవించువాడును కాదు.

ప్రశ్న—...అట్టియిన నీ కర్మ బంధము లెవని బాధించును?

ఉత్త—....ఎవడైతే, అహంకార మమకారములకు లోనై నేను కర్తను. నేను భోక్తను నేను దుఃఖిని, నేను సుఖిని

నేను పండితుడను, నేను కర్తను, అనియెడి యధ్యాసకు లోనగుచున్నాడో 'వాడు' జ్ఞానోదయ మగునంత వరకు ననుభవించుచున్న వానివలె గనుపడుచుండును కాని యథార్థమునకు వాడవి చేయను లేదు. ఆ యా కర్మఫలముల ననుభవించుటయును లేదు. ఏమోయీ వితాకు జెందుచున్నావు? నీకేదో సందేహామున్నట్లున్నది. యిది విను. నీవు గాఢనిద్రలో మగ్నుడవై యున్నప్పుడు, నిన్నొక చెలికాడు తీసికొని పోయి కొబ్బరికాయల కొఱకు నిన్ను చెట్టెక్కింపగా. మట్టపట్టుకొని రెండవ చేతితో కాయను మెలిబెట్టి కోయు సమయమున నీవు పట్టుకొన్న మట్ట చీలి నీవా కొబ్బరిచెట్టు నుండి క్రింద పడినట్లును. కాలు విఱిగినట్లును, ఆ మట్టగొట్టుకొని తల బ్రద్దలై రక్తము కాఱుచున్నట్లును, 'నిన్ను చుట్టుకొని నీ బందుగులేడ్చుచున్నట్లును, నీవుకూడ భాదకు నిలువలేక యేడ్చుచుండగా, దగ్గర పరుండియున్న వాడు నిన్ను కొట్టి లేపగా మేలుకొన్న నిన్ను జూచి యతడేమిటికిగా యేడ్చుచున్నావని యడుగగా, నటునిటు చూచి యేమియు లేదందువు. నిజమునకు నీవు పడనులేదు. నీకాలు విఱగను లేదు. మఱి యేమిది, కల, కలయందు గలిగిన కష్టసుఖము లెంత నిజమో యిదియునంతేయని నమ్ముము. కలయందు కలిగిన చెట్టెక్కి, పడుట, అను కర్మ వలనఫలము కాలువిరుగుట యింతే కదా, నిజమునకు నీవా చెట్టెక్కలేదు. నీకాలు విఱుగను లేదు. ఇదియు నంతే, అందుకొరకే స్వప్నజాగరములు రెండును, అజ్ఞాన కార్యములగుట వలన సమానములు

గనుకనే ద్రిష్టదర్శన దృశ్యముల కల్పనలు. ఉభయత్ర
సమానములు. ( సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహం )
అట్లయిన నీకర్మవలనఫలము నిరర్థకమై పోవలసిన దేనాయని
నీవనవచ్చును; ఎన్నటికిని పోదు. దేహాత్మభ్రాంతి
యున్నంతవఱకవి తమఫలము నిచ్చుచునే యుండును.
వానిఫలములను తానుకర్తగానున్నను. కర్తననుకొని
దుఃఖము వచ్చినపుడేడ్చుచు, సంతోషము వచ్చినపుడు
నావంటి యదృష్టవంతుడు లేడనిపొంగుచు, ప్రారబ్ద
జనకమగు శరీరమే నిత్యమని నిత్యుడగు తనను విస్మరించి
పశువులాగున సంచరించుచుండు వాడే యనుభవించును —

## ప్రారబ్ధము.

ప్రశ్న—...స్వామి. ప్రారబ్ద మంటిరే! దానిలక్షణము విన
వేడుచున్నాను. దీనుని కరుణింపుడు?...

ఉత్తరము... సవరణ జేయదగు ప్రశ్నల కొన్నింటి నైన
సమాధానము చెప్పవచ్చును. చెప్పెదను వినుము.

ప్రారబ్ధమనునది యొకటియైన నది మూడు తెగలుగా
నుండును. ఇచ్ఛాప్రారబ్దము... అనిచ్ఛాప్రారబ్దము. పరే
చ్ఛాప్రారబ్దము...

అందు ఇచ్ఛాప్రారబ్ద మనగా? ఒకచోరక వర్తకుని
యింటికి కన్నమువేసి సర్వస్వము నపహరించుకొని పోవు
చుండగా వాని రాజభటులు పట్టుకొనిపోయి రాజుముందు

నిలుపగా నతడది విచారించి యిట్టి పరద్రవ్యాపరిని బ్రతుకనీయరాదని తల గొట్టివేయ నాజ్ఞాపింపగా. భటులా దొంగ తల నఱికి వేసిరి. పరద్రవ్యాప హర్తలగు వారియందఱిగతి యింతేయగునని తెలిసి యుండియు నొక యవివేకి ఈతల గొట్టబడినవాడు, తెలివితక్కువగా మెలగి తనజీవితము నే గోల్పోయెననియు, తానంత కంటె మెలకువతో జేసిన యెడల తన కాపద, కలగదనియు జింతించి దొంగతనమునకుబోయి రాజభటుల చేతిలో జిక్కి తానును తలగొట్టబడెను. ఇదియిచ్ఛా ప్రారబ్ధము. వివేకియగువాడు. దొంగతనము చేసినయెడల ప్రతి వానిగతి యింతే యగునని తలంచి పరమేశ్వరదత్తమగు ద్రవ్యముతో తన కుటుంబమును పోషించుకొనుచు నితర ద్రవ్యమున కాసపడక, పరమార్థ వ్యతిరిక్తంబులగు పనులకుబోక బహుజన సమ్మతముగా తన జీవితము గడుపుకొనును.- గనుక ఇచ్ఛాప్రారబ్ధము, వివేకా వివేకులిట్లనుభవింపదగియుండును.

రెండవది. తానేదియు నెఱుగ కుండగనే వచ్చి పైబడునది. అనిచ్ఛాప్రారబ్ధము "ఇదియును వివేకులకు నవివేకులకు కూడసమానమే యగును. పోవుచుండగా కాలికి, తలకు దెబ్బతగులుట, గోడ విఱిగిపై బడుట, గోపురము, గుడితనపై గూలుట, ఎద్దుపొడుచుట, పాముగరచుట, బండిమీదనుండి పడుట, వ్యాధులు సంభవించుట మొదలగునవి. నిర్నిమిత్తముగా నపనిందల పాలగుట, అకారణ శత్రుత్వముకలుగుట, ఇవియన్నియు ననిచ్ఛాప్రారబ్ధము...

మూడవది... తానింటిలో కూర్చుని యుండగా నెవడో వచ్చి కాళ్లపైనిబడి, తనకు గొప్ప యాపద, సంప్రాప్తమయ్యెననియు. దిక్కులేని వాడననియు నాకు నీవే దిక్కని ప్రార్థింపగా జాలిపడి వానిని కాపాడుటకు పోయి నానా కష్టములకు లోనగుట, ఇది పరేచ్ఛాప్రారబ్ధము, ఇదియు వివేకులకు నవివేకులకు సమముగానే యుండును. ఈమూడు తెరగులగు ప్రారబ్ధములు అహంకారమునకే గాని నిస్సంగుడనగు నాకు లేవని జ్ఞాని యెరుగును.

ప్రశ్న— ఆగామి సంచిత ప్రారబ్ధము లందురు గదా వాటినిరూపణమెట్లు, మహాత్మా?

ఉత్త... ఓయీ, ఒక గ్రామములో నొక కృషీవలునకు సంవత్సరమునకు వేయిబస్తాల ధాన్యము పండును. ఆధాన్యములో కొంత కూలికిని, కొంత కప్పము గట్టుటకును, కొంత విత్తనములకును, కొంత తనకుటుంబ పోషణకును. వినియోగించి కొంతధాన్యమును, ధర కలిగినప్పుడు విక్రయించుటకై నిలువ చేయును నిలువ చేసినదే సంచితము, అనియు తన కుటుంబపోషణ కుంచిన ధాన్యమును, ప్రారబ్ధ మనియు చెప్పదగును ఇట్లుండగా బందిపోటు దొంగలు వచ్చి నిలువ యుంచిన ధాన్యమును కొల్లగొట్టుకొని పోయిరి. అతని భూమి దేవమాతృక యగుటవలన, అనావృష్టిదోషమేర్పడి పంటకై వేసిన పైరు నిలువున నెండిపోయెను. ఆపైరును గూడ పశువులు పడి పైరు నిరూపముగా జేసెను. బంధువులు తక్కువ గలవారును, వచ్చి యాకృషీవలు నాదరించి

యిప్పుడు కుటుంబపోషణ మెట్లు చేయుచున్నావని యడుగ, సంపాదించి దాచిన ధాన్యమును దొంగలు కాజేసిరి, పండి వచ్చు ననుకొన్న ధాన్యము వానలు లేక పైరు నిలువున నెండి పోయి నాశనమయ్యెను. ఇంటిలో నిదివరకు పదిలము చేసి యుంచుకొన్న ధాన్యమును తినుచున్నానని బదులు చెప్పెను దీనింబట్టి చూడగా, అమ్ముటకుంచిన ధాన్యము, సంచితము లేకుండపోయిన రాగలధాన్యము. ఆగామి, తనుతినుచున్న ధాన్యము ప్రారబ్ధము. అనితోచుటవల్ల। సంచితాగాములు పోవుననియు, ప్రారబ్ధమనుభవించి తీరవలెననియు స్థిర పడినది, అనాది నుండి జీవుడననుకొను నితడు, అనేకములగు పుణ్యా పాపమిశ్ర కర్మలను జేయుచు వచ్చుచుండును. జీవుడొక జన్మయందు చేసిన యొక కర్మ మనేక జన్మలకు కారణమగు చుండును. అదే ప్రకారము తన జన్మ కవధి కల్పించు కొనుచుండును. ఇట్లు పుణ్యా పాపమిశ్ర కర్మలు చేసికొనుచు రాగా రాగానవి కొండలంతలు పెరిగి పోవును. దీనినే సంచిత మందురు, అటు తరువాత మృతిపొంది, తిరిగి జన్మమెత్తుటకై యీ సంచితములో కొంత గ్రహించుకొను చుండును, ఆ సంగ్రహింపబడిన కర్మము పంచీకృతభూతముల శరీరాకారముగా నేర్పాటుగావించి, యీ శరీరముతో కొన్ని పుణ్యా పాప కర్మలు చేయుచు, కష్ట సుఖములననుభవించు చుండును. దీనికే ప్రారబ్ధమని పేరు. ఈశరీరముతో ప్రారబ్ధ మనుభవించుచు, మరల కొన్ని కర్మలు చేయుచు మరణ పర్యంతము జ్ఞానశూన్యుడైయుండును, దీనికి ఆగామియని పేరు, ఈ ఆగామి సంచితముతో చేరుచుండును. కావున నితని జన్మ

ముల కంతము లేక యుండును. ఇట్లు కొన్ని వేలు లక్షలు జన్మములు కలుగుచు, పోవుచునుండగా, నొక జన్మమున మనకీ సంసారము పోవు మార్గమేదియను వివేకముపుట్టును. అది మొదలు పరమేశ్వరార్పణముగా విధి విహిత కర్మల నాచరించుచు, పరమేశ్వరారాధన చేయుచు రాగా రాగా నిశ్చంచలమగు భక్తి జనించును ఆ భక్తి వలన క్రమముగా జ్ఞానోదయమగును. జ్ఞానోదయము వలన సద్గురు లాభము గలుగును. తద్వారా శ్రవణ మననాదు లేర్పడి, ప్రారబ్ధము ననుభవించుచు, నీప్రారబ్ధ మహంకారమునకేగాని, అహంకార సాక్షినగు నాకు లేదని ఆగామి సంచితముల నశింపజేయును. ప్రారబ్ధముమాత్రము భోగింపక తప్పదు. ప్రారబ్ధము భోగించుటవలన నశించును. సంచితము తత్వజ్ఞానమున నశించును. ఆగామి పుణ్య పాపములు ఇతనిని కొనియాడువారు. దాని పుణ్యమును, దూషించువారు వానిపాపమును, తీసుకొని యనుభవింతురు. అభ్యాసకుడు పవిత్రుడగును.

## హితోపదేశము.

సోదరులారా! సోదరీమణులార!

ఏనాడొనరించిన మహాపుణ్య వశముననో యిప్పటికి మనకీ మానవ జన్మ లభించినది. తక్కిన ఎనుబదినాల్గు లక్షల జీవరాసులలో నీ మానవ జన్మయొక్కటి మాత్రమే జ్ఞాన మార్జించుటకు గాని, మహాజ్ఞానాంధకారమున మునిగి కావలసినన్ని జన్మల కవధి కల్పించుకొనుటకుగాని,

తగినది. తక్కినవి ప్రారబ్ధ మనుభవించుటకు మాత్రమే తగియున్నవి. "అందు వలననే జంతూనాం నరజన్మ దుర్లభం' అని పెద్దలు చెప్పియున్నారు. ఈ జన్మము భక్తి వైరాగ్యముల నార్జించుటకై తద్వారా మోక్షమును జెందుటకై మహా దయాసముద్రుండగు పరమేశ్వరుడు మనకు ప్రసాదించి యున్నాడు, దేహాత్మభ్రాంతిచే విషయసుఖములమరిగి పశువులలాగున నాహార నిద్రా మైథునాదుల నపేక్షించుచు పశువులలాగున సంచరించి మనమెత్తినజన్మలు గణనాతీతములని యూహింపదగియున్నది. మనమిదివరకెన్ని జన్మలెత్తినను కడసారి జన్మమిదేయని ముఖ్యముగా తెలుసుకొనవలసి యున్నది. మానవజన్మ మనకికముందు దొరుకుట దుర్లభము మానవుడై పుట్టి మరల మానవజన్మకు రాగలపనుల జేయుచుంటిమేని వచ్చిన మానవజన్మ రావచ్చును. ఏమో ఏమి పనుల జేయుచుంటిమో యెట్టి దుష్కర్మములకు, దురాచారములకు లోనగుచుంటిమో! ఏకర్మవలన నేజన్మలభించునో 'గహనా కర్మణోగతిః' అనిభగవానుడు చెప్పినాడుగదా "శరీరం కర్మసంచితం" శరీరము కర్మచేసంపాదింపబడినది మనము చేసియున్న కర్మల కనురూపముగా కుక్కలమేయగుదుమో నక్కలమేయగుదుమో, పురుగులమగుదుమో, మఱియేమగుదుమో, చెప్పుటకు సమర్థుడెవడునులేడు అయితే, మీరు చెప్పిన జన్మలలో పూజ్యమగు నరజన్మ మెత్తినాముగద. ఈ శరీరమును పొందుట చాలదా యందురేమో, ఇదియొక్కయుచితా నుచితముల నెఱుంగుటకు మాత్రమే మనుష్య శరీరమువచ్చుట దుర్లభమని చెప్పినాముగాని ఇదియును

భౌతిక మే యగుటవలన తక్కిన శరీరములతో పాటు అమేధ్యం అనగా మల మూత్రములు, రక్తము, చీము, మాంసము, మజ్జ నరములు, మొదలగు వానితో నతినింద్యమైనది, అసహ్యమైనది ఇట్టి శరీరమునకు మూర్ఖులు రంగులు వేట్టుదురు హిమోనియా శాండిల్, లక్సు మొదలగు సబ్బులతో తోముదురు. శరీర పోష్టవమును. జూచుకొనలేక పొంగి పోవుచుందురు. తుద కీశరీర సౌష్టవమంతయు చెడి ముడుతలుపడి, తుమ్మెదరెక్కల లాగునవుండు వెంట్రుకలు జనపనారపీచు ననుకరించుచు తెల్లనై 'అంగవికార మేర్పడి' రోగాలకు మూలకందమైయుంచ మునబడి కృషించి కృషించి, తుట్టతుదకో మంటపాలో లేక గుంటపాలో యగును. ఇది పండితులకును మూర్ఖులకు కూడ తెలియనిది కాదు, ఆ గుంటపాలు. మంటపాలు, అగునది తాను నిత్యమైనదని భావించి, నింద్యానింద్య పదార్థ వివేకము మాని కాలా కాలముల విసర్జించి మృగము లాగున తెగదినుపించి పెంచబడిన యీస్థూల శరీర మేగాని తానుమాత్రము శాశ్వతముగా నుండువాడే 'అయితే. నేను' అని తాను తనశరీరమునే యనుకొనును గాని తనకు శరీరమునకు నేవిధమయిన సంబంధ ములేదని మాయావృత్తుడై తాను తెలిసికొనజాలడు. ఈశరీర మునకు కారణశరీర మొకటి కలదు. మఱియు సూక్ష్మశరీరమని యొకటి కలదు స్థూలము, సూక్ష్మము కారణము. అని జీవు నకు మూడు శరీరములు కల్పింపబడినవి, కారణశరీర మనగా ఆ నాద్యజ్ఞానము. సూక్ష్మశరీర మనగా, పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, కర్మేంద్రియములయిదు. జ్ఞానేంద్రియము లయిదు. మొత్తం పదునేడుగూడి సూక్ష్మ శరీరమని చెప్ప

బడును. స్థూలమనగా కరచరణాద్యవయవములు గలిగి స్తంభము లాగున కనుపించునది. అయితే ఈమూటికి శరీరములని పేరెందుకు వచ్చినదందురా? జీర్ణించునవి గనుక, అట్లయిన వానిని దేహములందుమందురా? తాపత్రయాగ్నులచే తగుల పడునవి యనియర్థము చెప్పుదురు. శరీరము కృశించునది గనుక శరీరమని స్థూలమును శరీరమని చెప్పుటభావ్యమే సూక్ష్మ కారణములకు కూడ శరీరమని యేల చెప్పిరందురా! కారణసూక్ష్మములుకూడ నశించునవి గనుక, వానికిని శరీరములని చెప్పవలసి వచ్చినది. స్థూలసూక్ష్మములకు కూడ రోగములు వచ్చునాయని మీరడుగవచ్చును. ఆ రెంటికిని రోగములురావు. స్థూలమున పడిపోదుము. ముముక్షుత్వము కలుగగానే వానికి కృశత్వమారంభించి, క్రమక్రమముగా జీవబ్రహ్మైక్యాను సంధానము కలిగి, బ్రహ్మభూతుడు కాగానే, అజ్ఞానమయమగు, కారణదేహమునశించును. కారణదేహము నశించగానే సూక్ష్మదేహము నశించును. తరువాత ప్రారబ్ధానుభవ పర్యంతము నామమాత్రముగా నుండి, స్థూలము నశించును. తరువాత ఈ స్థూల సూక్ష్మ కారణము లుపాధిగా కలిగియున్న జీవాత్మయే పరమాత్మయగును.

ఘటాభావమునందు ఘటము (కుండ) యందున్న ఆకాశము మహాకాశమయినట్లు, ఉపాధిలేకపోగానే యీ యాత్మయే బ్రహ్మమైయుండును...అని శాస్త్రము నిర్ణయించు చున్నది.

కావున మనము శరీరమే యాత్మయను భ్రాంతిని వదలి మహాత్ములగు మునిపుంగవులు జూపిన మార్గమునవలంబించి సుజ్ఞానధనార్జనకు సర్వదా ప్రయత్నించుట, సద్గురువులనాశ్రయించుట, తదుపదిష్టముల ననవరతమూచరించుట, సజ్జనసాంగత్యము, సంసారసాగరోత్తరణకు నౌకయని తిృశుద్ధిగా వారి నాశ్రయించుట ముఖ్యము. గురువులనాశ్రయించినట్లు సజ్జనులకూడ నాశ్రయింపవలెనా యందురేమొ, "ఏకాంతే సుఖమాస్యతాం" అని భగవత్పాదాచార్యోపదేశము, అగుట వలన సజ్జనులుగూడ సామాన్యుల స్థూలదృష్టికి అందరివలెనే యుందురు. కనుక, వారిని గుర్తించి యాశ్రయింపవలెను. దుర్జనులకూటమి దూరముగా విడువవలెను. వేదాంతశ్రవణమునందాసక్తి కలిగి యుండవలయును. వేదాంతశ్రవణముచేయుచున్నాము, వేదాంతులమే యగుదుమని వృథాగర్వింపక బంధవిముక్తి ప్రసాదింపునని శ్రీమన్నారాయణుని సర్వదా భజింపుచుండవలెను.

అట్లు చేయనియెడల మనము జననమరణప్రవాహములో బడి, కామక్రోధాదులను, జలచరములచే, బాధనొందువారమగుదుము. ఇట్టిసూయను దాటవలెనంటే, మనమీ జన్మయందు, సజ్జన సహవాసముచేసి, దైవభక్తికలిగి, పెద్దలను సేవించి, వివేకముసమార్జించి, భ్రమరహితులమై, యోగమును సాధించి, మాయా కల్పితంబయిన యీసంసార మహార్ణమును తరించి ఆగామి సంచితముల జ్ఞానాగ్ని చేతగాల్చి, పరబ్రహ్మమును పొందవలయును. సోదరులారా! మనల ప్రకృతిజ్వరము

పీడించుచున్న కారణమున నశక్తులమైయుంటిమి. తద్వారహారం బగు జ్ఞానౌషధసేవ చేయకున్న నానాటికి శుష్కించిపోవుట నిక్కము. గనుక సద్గురుని వెదకి ఆత్మానుసంధానము సదా చేయ వలెను. అట్లు సేవించినయెడల దుఃఖవ్యాధి నివృత్తి కలిగి యా నందారోగ్యమును పొందగలము. యోగ సంపన్నులగువారికి జగములు వణకును. దేవేంద్రాదిదేవతలు సైతము మహా యోగులను గాంచి భయపడుచుందురు. మహాయోగులు స్వచ్ఛందవిహారులై పదునాల్గులోకములయందును నిరాఘాట ముగా సంచరింపగలరు. భూతభవిష్యద్వర్తమానముల నిము సములో గ్రహింపనోపుదురు. అగ్నిస్తంభన, జలస్తంభన, వాయుస్తంభనముల, ననాయాసముగా నొనరింపగలుగుదురు. ఇంతయేల, యోగసిద్ధిగల మహాపురుషుల కసాధ్యమేదియును లేదు. వారి సంకల్పము, కల్పవృక్షము. వారి యాజ్ఞ, శివాజ్ఞ వారి వాక్కులమృతపూరములు. వారిచూపులు సుధాకలిత ములు. వారలిగిరా! ఆపదరుద్రులే యగుదురు, అయినను సామాన్యముగా మహాపురుషులు తమయోగబలమును వృథా గా దుర్వినియోగము చేయరు. ఒకప్పుడు స్వర్గలోకమును కూడతృణీకరింతురు, అట్లుగాక యోగసిద్ధిచేలోకమునమహాత్త్వ వెల్లడించెడి యిచ్ఛయే ప్రధానముగాయున్నచో, నదీకూలస్థ మగు మహావృక్షము. నదీతరంగాఘాతమున క్రమక్రమముగా వేళ్లు తెగికూలినట్లు, క్షణక్షణమునకు వారార్జించిన యోగబ లము ప్రపంచవాసనలచే, తరిగి పతనము జెందుదురు. "కాని సత్తామాత్రులమగు మనమేదియు నెఱుగము. అది అంతయు ప్రకృతివైచిత్ర్యమని తమదివ్యశక్తిని లోకమునకు వెల్లడింపక

పూర్వదృష్టి సర్వదాగల మహాపురుషులు మాత్రము ఎన్నటికి నధఃపతనము జెందరు. సర్వజ్ఞులుమహాత్ములను,భక్తులలక్ష్యోద్ధరనిమిత్తమున్ను ధర్మము నుద్ధరించుసమయమున వినియోగింపవచ్చు. యాగపశువుగా గొంపోవబడు శునస్సేఫునకు, నభయదానము చేసి, విశ్వామిత్రుడు, హరిశ్చంద్రుని యజ్ఞమును నిలుపలేదా! కామధేనువును గొంపోవుచున్న విశ్వామిత్రిబలమును, వశిష్ఠమహాముని తన యోగబలమున గెలిచి హోమధేనువునువిడిపించుకొనలేదా।అగస్త్యమహామునిబడ్డగెడయగు భూమండలమును, తన కమండలువెట్టి, సరిగా నిలుపలేదా! విద్యారణ్యమహాముని, మూసలో మసలుచున్న యినుమును గడగడ తాగలేదా మహాత్ములగు వారిట్లెందరెన్ని మహాత్తరకార్యము లొనరించిరి? వారు పునర్జన్మమునకు వచ్చినట్లే పురాణేతిహాసములును చెప్పియుండలేదు. దీనిని బట్టి మనమూహింపదగిన దేమియనగా స్వయంప్రత్వాత్వాధీనములగు. నణిమ, గరిమ, మహిమా, లఘిమ మొదలగు సిద్ధులు సైతము జన్మకారణములు ముమ్మాటికిని కావు అట్టిమహనీయులు ప్రపంచోద్ధరణకై యవతరించిన యపరశివావతారులే యగుదురు కావున నే సద్గురువులు శిష్యవిత్తాపహారులుగాక, హృత్తాపహారులై యవ్యాజకరుణాతరంగిత హృదయులై లోకమునసంచరించుచు, తమ్మాశ్రయించిన వారికి భక్తిజ్ఞానవైరాగ్యముల భోధించుచూ, తమ ప్రవర్తనలచే లోకుల సత్ప్రవర్తులను జేయుచు, బ్రహ్మానంద సుధాసాగరమున గ్రుంకులిడుచుండిరి. కొందఱు పుణ్యమూర్తులై భగవంతునకు పరమాత్మకు నభేదము వాటించి, యనవరతమును భగవంతుని తమ హృదయ

పీఠమున నిల్పి సేవించి, కృతార్థులైరి. అట్టివారిని స్మరించినను కూడ పాపపరిహారమగును. కావున కొందరిని పేర్కొనుచున్నాను. పోతనామాత్యుడు, త్యాగరాజు, నారాయణతీర్థస్వామి, జయదేవుడు, అల్లూరి వేంకటాద్రిస్వామి, తూము నృసింహదాసు రామదాసు, ఎడ్లరామదాసు, కబీరు, కమాల్, నామదేవ్, ఘోరాకుంభార్, నందనార్, మొదలగుమహాత్ములు చిరస్మరణీయులు. వందనీయులు. నిజమునకు మోక్షమార్గములలో పిపీలికా మార్గము. సుగమమైనది, ఆపిపీలికామార్గమునకు భక్తియే సర్వరక్షాస్వరూపమయినది. అనియదార్థముగనుకనే పోతనామాత్యుడు, తనభాగవతమున నొకసందర్భములో—

కం॥ నీపాదకమల సేవయు । నీపాదార్చకులతోటి నెయ్యమునునితాం । తాపార భూతదయయును । తాపస మందార మాకు దయచేయగదే ॥ అని వ్రాసికొని యున్నారు. వింటిరా! ఆభగవద్భక్తియు నెట్లుండవలెనో? నితాంతాపార భూతదయయును, (అనుటలో, భూతదయ, అనగా, ఆత్మవత్సర్వభూతాని) సర్వభూతములను తనవలనే చూచుకొనుట. మృత్పిండ మొకటియే బహుభాండ రూపములుగా దోచినట్లును, బంగారమొక్కటియే అనేకభూషణములుగా దోచునట్లును, ఆవులనేక వర్ణములు గలవయ్యు, నొకేవిధమగు పాలుగలవైనట్లును, పరమాత్మ యొక్కడే, బహుదేహవర్తిగా దోచుచున్నాడు అని గదా! ఆ భక్తపోతనయభిప్రాయము. 'తండ్రీ' పోతనామాత్యభక్తితత్వము నెంతరమణీయముగా వెల్లడించితివి. ప్రహ్లాదుని తరువాత రెండవప్రహ్లాదుడవేకదా! గనుకనే నీభాగవతమాచంద్రతారార్కముగాసజ్జనస్తోత్రపాత్రమై, సర్వజనకర్ణరసా

యనమై, భక్తబృందకరిఘటాపంచాస్యమై, భక్తిజ్ఞానవైరాగ్య రత్నాకరమైవర్ధిలుచున్నది. ఆధునికభక్తులు, యోగులు లోకమున లేకపోరు. వీరు వారిననుకరించు నెడలపూజ్యులేయగుదురు సోదరులారా!- అనేక జన్మసంసిద్ధి కలిగిన యనంతరము పరమోత్కృష్ట గతిని పొందుచున్నాడనుట నిర్వివాదాంశము. దానింబట్టిజూచినను, విహంగమార్గమున నెగిరి యొక్కతూరిగా మోక్ష సామ్రాజ్యమును చేరగోనుట. యెవరికిని సాధ్యముగానిపని. అందుకనే అనుభవజ్ఞులగు సత్పురుషులు, "మాయా విలసితమిద మితిబుధ్వా । దుర్జనసంగ మతి దూరీకురు । సజ్జన మాశ్రియ । పరధన పరదారాభిరతింత్యజ । పారలౌకికధర్మం పలించిను పద్మాపతి పదపద్మంసేవయ । బంధముక్తయే,భోచేతశ్శ్రీరామంభజ" అనగా, ఈప్రపంచము మాయయొక్కతళుకు అని తెలుసుకొని, దుర్మార్గుల సాంగత్యము దూరము చేయుము. సజ్జనులనాశ్రయించుము, పరధన పరస్త్రీకాంక్షల విడువుము, పరలోక ధర్మములందు కృషి చేయుము, సంసార బంధవిముక్తికొరకు శ్రీనివాసుని పదకమలముల సేవించుము. ఓమనసా శ్రీరామునిభజించుమూ, అని చెప్పియున్నారు. పైచెప్పిన మార్గమున నడచుచు తానెంతశ్రవణమననాదులు కలవాడయినను, అభ్యాసకుడుగాని, ఆరురుక్షుడుగాడు ఆరురుక్షుడగుపర్యంతమును, పరమేశ్వరార్పణగా విహిత కర్మలు చేయుచునేయుండవలెను. భగవత్సేవయు, భగవన్నామ సంకీర్తనంబును మానరాదు. తానుసవిశేషముగానో, నిర్విశేషముగానో సమాధి చేయగలవాడయ్యేనేని, ఆసమయమున జప తపనామ స్తోత్రములమానుట, స్వభావముగా తటస్థమగును. ఆమానుట

చేయుటకంటె నెక్కువ ఫలప్రాప్తి కలిగించును. ఏమది ఒకరి మొగమొకరు చూచుకొనుచున్నారు. ఆరురుక్షుడన నెట్టివాడో చెప్పలేదనియా? చెప్పుటకు సందేహమిసుమాత్రము లేదు వినుండు. అభ్యాసకుడనగా "సాధకుడు" మన మందఱమును సాధకులమే గావుననది చెప్పుట సంక్షేపించి ఆరురుక్షులక్షణము చెప్పుచున్నాను అఖండమై సద్గురూపాసనచే సమస్తకామములు విడచినవాడును, మోహమను దానిని కలలోగూడ తలంపకుండువాడును, అన్ని రకములయిన యాశాపాశములను, మొదలంట గోసివేసినవాడును, రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్య, ఈర్ష్య, అసూయ, డంభ, దర్ప, అహంకార, ఇచ్ఛా, భక్తి, శ్రద్ధలను, ఈపదియారింటిలో భక్తిశ్రద్ధలను తక్క, తదితరంబులగు, పదునాలుగింటిని, సమగ్రముగా వర్జించినవాడును, ఇంద్రియముల జయించినవాడను శ్రీ గురుహస్తాలంకృత మస్తకుండును, నిరంతర బ్రహ్మానందలహరీమగ్నుండునునగు, మహాత్ముడే ఆరురుక్షుడని చెప్పదగినవాడు. అట్టి వాడుగాక ఒక యడుగు పన్నీటిలోను, రెండవయడుగు దుర్వాసనా జలములోను, బెట్టి యున్నవాడెట్లుసిద్ధుడనబడును. కావున నట్టి స్థితివచ్చునందాక నేదియు విధివిహితములగు వానిని మానుట పరమార్థభంగమనుట తప్పగాదు. అయితే నీవు కర్మ, కర్మయని నేను చెప్పుదానిని సత్కర్మగా గ్రహించి యకర్తృత్వముగా చేయుదువుగాని అన్నింటికిని కర్త పరమేశ్వరుడేకదాయని దుష్కర్మచేసి దానికి పరమేశ్వరుడేకర్తగదాయనియు, నందువలన మనకు పాపము లేదనియు తలంచుట, వివేకముగాదు. దీనికొక కట్టుకథ కలదు. పూర్వ

యొక బ్రాహ్మణుడు పురాణశ్రవణమునకుఁబోయి వినుచుండగా నాపౌరాణికుడు పరమేశ్వరార్పణ బుద్ధి కలిగి చేసిన కర్మల యొక్క ఫలము. కర్మకారకులను చెందదని, కథాసందర్భములో చెప్పగా విని యది మొదలుకొని యేపనిచేసియు కృష్ణార్పణమ నుచుండెడి వాడట. ఇట్లుకొంతకాలము గడచిపోవుచుండగా నొకనాడు నిండు చూడి యావొకటి తన వంగచెట్లుపోలిక లేకుండ తినివేయుచుండగా జూచి యాయన మిక్కిలి కోపముతో దానినొక కఠినపాషాణముతో విసరివేయగా నది కాలకర్మ వశమున, గోవునెమరు కణతనుతగిలి తక్షణమే యది చచ్చెను. అది చూచి యా బ్రాహ్మణుడు కృష్ణార్పణమని నిర్భయముగా బలికి గోహత్యాపాతకమునకు నేను కర్తనుగాదని తలంచెను. సర్వలోకాంతర్యామియగు భగవానుడది యెరింగి యా బ్రాహ్మణునకొక యజ్ఞము చేయసంకల్పమును కలిగించెను. భగవత్సంకల్పమునకు వికల్పము లేదు. గనుక యజ్ఞము చేయుట కా బ్రాహ్మణుడు యత్నించి యజ్ఞ సంబారముల సమకూర్చుకొని యజ్ఞముచేయ నారంభించెను. ఆసమయమున సర్వజ్ఞుడగు నప్పరమేశ్వరుడొక ముసలిపాఱుని వాలకము ధరించి పిడుగులు పడినను కూడ వినరాని యంతటి బధిరముతో చూపులేని వానివలె నటించుచు నొకకఱ్ఱ కేల నలవరించుకొని నేలబొడుచుకొనుచు నల్లనల్లన యజ్ఞవాటికం బ్రవేశించి కనపడ్డవారినెల్ల అయ్యా, యజమానినిం జూపుడని ప్రార్థించుచు వారు చెప్పిన మాటలకు సంబంధము లేకుండ నేమో ప్రవిభాషల నాడుచు నతికష్టముగా నమ్మహాజన సంఘము నతిక్రమించి యజమానుని చేరి అయ్యా, ఈయజ్ఞము

నకు యజమాని యెవ్వడని యజమానుడగు బ్రాహ్మణుని యడిగెను. సభికులందఱును, జప్పటులుగొట్టుచు నవ్వుచుండిరి ఆ వృద్ధభూసురునిజూచి యజమానివి నేనే యని యాతడనెను. అయ్యా, నాకు చిన్నతనములో స్ఫోటకముపోసి పెద్దచెవు డేర్పడినది దయయుంచి పెద్దగా చెప్పండి. మీరేనా యజమా నులు అని అడిగెను. నేనేనయ్యా, అని ఆ యజ్ఞకర్త బిగ్గరగా నాముదిసిన బాపనయ్య చెవిలో నఱచెను. విని యా మాయ దారి లీలాపురుషుడు నా పెద్దభార్య పోయినది. రెండవ దానిని నాలుగేడులయినది చేసికొని. దానికి యిప్పటికి మూడవనెల అంచున్నారు. నేబోయెదను, పెద్దగా చెప్పండి అయ్యా. ఈయ జ్ఞమునకు కర్తవు నీవేనా, అని యడిగెను. అందులకయ్యజ మాని రొమ్ము కొట్టుకొనుచు, నేనే, నేనే, నేనేయని ముచ్చటగా మూడుసార్లు త్రేతాగ్నులసన్నిధిలో మహావిద్వత్సభలో రొమ్ము కొట్టుకొనుచు, మూడుసారులు కర్తను నేనేయని బిగ్గరగా నర చెను. అదివిని యాదొంగపాఱుడు పకపకనవ్వి, సభికులు విను చుండ, ఓరిపండితమన్యుడా! యజ్ఞమునకు కర్తవునీవా? చూడి యావునుచంపినమహాపాపమునకు కర్తను నేనా? అమ్మహాపాప మున భిల్లుడవై యరణ్యమున బుట్టుమని శపించి, సభికులుజూచు చుండ నచ్చటనే యంతర్ధానమునుపొందెను. ఈకథవలన మన కేమి పర్యవసానము తేలినది? సత్కర్మానుష్ఠానము చేయుట యవసరముగాని, పాపకర్మలాచరించుచు నన్నిటికిభగవంతుడే కలడనుటయు, ఆ కర్మ మాచరించినది త్రికరణములుగాని నిర్లిప్తుడనగు నేనుగాదని శుష్కవేదాంతములు చెప్పుటయు రౌరవాది నరక కూపంబున బడుటకు కారణమగును అని

తేలినది. ఓ నా ప్రియ సోదరులారా! మిమ్ము ప్రబతిమాలుకొని చెప్పుచున్నాను. కావడి పెట్టెలో బోసిన నీళ్లవలె మన యాయుస్సు తరిగిపోవుచున్నది. పేదవాడగు విటుని వెలయాలి విడచి పెట్టుచున్నట్లు, పటుత్వము ఇంద్రియములను విడచి పెట్టుచున్నది. ప్రజ్ఞ, కార్చిచ్చు నడవి చెట్లను, కాల్చుచుండ తమ యునికి విడచిపోవు లేడిపిల్లవలె మనకు గాకుండ పోవు చున్నది. కావున నీ దేహము వ్యర్థమయినదని నమ్మి యాత్మ పదవి పొందుటకు సర్వథా ప్రయత్నించండి. నాపై కోపగించ కండి. మీముఖ లక్షణంబులుజూడ మీకు చెప్పినదే చెప్పినదే చెప్పుచున్నానని, వినుగు జనించినట్లు కనుబడుచున్నారు. మీకు నా మాటలవలన కోపము వద్దు. ఉదయము మొదలు కొని నిదురించు రాత్రి సమయము వఱకు ప్రత్యహము మీరు చేయుచున్న నిత్య కృత్యములలో స్నానమూ, పానమూ భోజనమూ, బాలబాలికా లాలనమూ, కుటుంబ పారవశ్యమూ ధనార్జన ప్రయత్నమూ, భార్యా సంయోగమూ, మలమూ త్రోత్సర్జనమూ, ఇందులో నేదికొత్తది మీరు చేయుచు న్నారో, మీరెవరయిన చెప్పగలరా! నిదుర లేచినది మొదలు రాత్రి కాలము వచ్చువఱకును మీరందఱును చేసి నదే చేయుట కలవాటుపడి యున్నారు. నేను భగవత్తత్త్వ మగుట వలన వినువారిబుద్ధికెక్కినదాక, చెప్పినదే చెప్పుట కలవాటు పడియున్నాను, సాంసారిక కృత్యములు నిత్యమేమర కచేయుటచేయువారికి విధిగాదోచినదోచవచ్చునుగానినిజమున కవి నిరర్థకములు నేను చెప్పుమాటలు సార్థకములు జన్మజరా వ్యాధి మరణబాధా నివారకములు, నిత్యానందదాయకములు

కావున విసువు జెందవలదు. రోగికి పథ్యము చేయుట కష్టము గానే తోచును. జిహ్వా చాపలమున నించుక యపథ్యము జరిగెనేని యంతరింప నున్న రోగము తిరిగి యంకురించి తుదకు వానికాశరీరమునే దూరముచేయుననుట, సర్వజనవిదితమే కదా! మనము సంసార రోగగ్రస్తులము. భగవత్తత్త్వము, పథ్యము. ఆరోగికెట్లు పథ్యము హితమో, ఈసంసారరోగపీడి తునకుగూడ భగవత్తత్త్వ పథ్యము హితము. ఆదినివిషముకంటె విషముగా నుండును. తరువాత నదియమృతమే యగును. ఇది భగద్వాక్యమే యత్తదగ్రే విషమివ । పరిణామేఽమృతో పమంలో గనుక ఇప్పుడే విషయ వాసనా మగ్నంబులగు మీామనస్సుల పరమార్థము వైపునకు త్రిప్పి, పరమార్థ మన నెట్టిదో తద్గులను విచారించి, నియమ పూర్వకముగా శ్రీమ దాదినారాయణుని పాదము లాశ్రయించి భజించి సారూప్య మును పొందుట మంచిది. ఇక సారూప్యమన యేమిటి. భక్త శిరోమణి పోతనామాత్యుడు. కం॥ గోవిందనామకీర్తన, గావిం చి భయంబుదక్కి ఖట్వాంగధరి, శ్రీవిభుడు చూరగొనియెను, కైవల్యము,తొల్లి, రెండుఘడియలలోనసే ఖట్వాంగమహాపతి భగవన్నామ సంకీర్తనమున మోక్షము జెందెనని, తనభాగవ తమున వ్రాసియున్నాడు. ఒక ఖట్వాంగుడని యేమిటి అనేక మంది భగవత్ప్రసాదమున ముక్తిని జెందియున్నారు. ఏయు గము మాట యెట్లున్నను హరేర్నామైవ నామైవ భవతారకం కలౌనాస్త్యేవనాస్త్యేవగతిరన్యథా॥ ఈకలికాలమునభగవన్నా మసంకీర్తనమునకంటె నన్యమగుగతి లేదని మహాత్ము లెందరో యుద్ఘాటించి యున్నారు. అది బహు సులభముగాని కష్ట

మంతమాత్రమునుగాదు. ధన వ్రయముతో నవసరములేదు. శరీరకష్టమూ అంతకంటెలేదు. ఆ శ్రీహరినామ సంపాదనకు శ్రమపడ నవసరములేదు. నారాయణేతిమంత్రోస్తి, వాగస్తి వశవర్తినీ నారాయణ అనుమాత్రము, సులభసాధ్యము నోరా మన వశమున నున్నది. ఇకమనమేమికష్టముచేయవలనోనాకు భోధపడకున్నది. ఇంత కంటె మోక్షమార్గించుటకేదియైన మార్గమున్నదని యెవరైన చెప్పినచో వానిని వాని వాక్యములను, మన మంతమాత్రమును, విశ్వసింపరాదు అయితే, భగవధ్యానమేది ఒక నారాయణమూర్తిని తప్ప నితర దేవతాధ్యానము చేయుట తగదా యందు రేమో, భగ వధ్యాన మొకదుందులే ప్రధానముగాని ఆ నియమము లేదు. కొందరు పరశివపాదుకార్చనచే కృతార్థులైరి. కొందరు పరా శక్తి నర్చించి కృతార్థులయిరి. ఏ దేవతోపాసనను చేసినను, ఆకాశమునుండి పతితమైన జలము సదనదీరూపములుగా ప్రవ హించి సముద్రము నెట్లు చేరుచున్నవో, అట్లే సమస్త దేవత లకు చేసిన నమస్కార పూజాధ్యానములు. నారాయణమూ ర్తినే జెందును. ఇదిగాక ఏ యే దేవతల భక్తులారాదింతురో ఆయా దేవతా స్వరూపములనేనుధరించి వారి యిష్టసంపదలనే నేయొసంగుచును. అని భగవానుడు చెప్పినాడు, లోకములో నాకృతులెన్ని విధములుగా నున్నవో అంతఃకరణాలన్ని విధ ములుగా నున్నవి. లోకము భిన్న రుచికలది. అందు వల్ల దేవోపాస్తియందు భక్తులనేక మార్గముల యనేక దేవతల నారాదింతురు. దానివలనప్రత్యవాయములేదు, ఎందుచేతనని మీారడుగవచ్చును. కం॥ మాయా ప్రతిబింబంబును । మాయా

ధిష్ఠానపరము, మాయయు గూడక, మాయావియైన ఈశుడ
మాయకుడగునతడు బ్రహ్మమయుడై యుండెన్, అనిగదా! ఈశ్వ
రరూపనిర్ణయము? సర్వాధిష్ఠానమైన బ్రహ్మము, శుద్ధమాయాద
ర్పణమున బ్రతిబింబింపగా నయ్యధిష్ఠాన చైతన్యము ప్రతిబింబము
మాయ, ఈమాయను గూడి యీశ్వరుడగును బింబరూపమ
యిన దానికి అనగా, అధిష్ఠాన చైతన్యమునకు, కరచరణాద్యవ
యవ నామరూపము లుండినగదా! ప్రతిబింబమునకు గూడనివి
యుండుట మన ముఖము నద్దములో చూచుకొను నప్పుడు,
మన ముఖమెట్లున్నదో యెట్టి వికారసహితమై యున్నదో,
అనగా, అద్దము చూడగానే యొకడు పండ్లిగిలించును ఒకడు
నాలుక వెళ్ల బెట్టును, ఒకడు మూతి త్రిప్పును, ఒకడు మీస
ముదువ్వును, ఇవియే వికారములు ఇట్టి వికారములే అద్ద
ములో కనుబడును, నిరవయవమగు నధిష్ఠానమునకు వికారము
లెట్లుకలుగును? వికారశూన్యము దర్పణములో ప్రతిబింబించి
రూప వికారసహితముగా దోచుట యెట్లు సంభవమగును.
కాదు గనుక, ఈశ్వరుడుకూడ నిరవయవుడే, నిరాకారుడే
అయితే, యీశివకేశవులకు, శివుడని, పశుపతియని శంభుడని
సాంబుడని, శంకరుడని, బలరాముడని, కృష్ణుడని, కేశవుడని,
గోవిందుడని, యీ పేర్లును, కృష్ణుడు, నీలమేఘ వర్ణశరీరుడని,
శివుడు, ధవళాంగుడని, అమ్మవారికి త్రిపుర, భైరవి, కాత్యా
యని, బాల, బగళి, వారాహి, శ్యామల, చండియని పేర్లెట్లు
వచ్చినవి. మరియు పరమేశ్వరి జపాకుసుమములాగున నెఱ్ఱగా
నుండునని చెప్పుదురే తద్రూపములెట్లు వచ్చినవని మనము
యోచింపవచ్చును ఆరూపములు ఆ నామములు అన్నియు

కల్పితములే, ఎవరిచే కల్పింపబడిన వంచురా. సామాన్యులకు నామస్మరణ పూజాసౌకర్యమునకై ఋష్యాదులచేతనే కల్పితములయినవి. ఆకల్పితములగు రూపములు బహువిధములుగానున్నవి, కేవలము మాయా ప్రతిబింబితమై యధిష్ఠానచైతన్యమే విరాట్టు. ఇతనికి భూమిపాదములు, స్వర్లోకముశిరస్సు ఆకాశము, పొక్కిలి, సూర్యచంద్రులు కన్నులు, దిక్కులు, చెవులు, నోరు, కృశానుడు, అనగా, శ్రోతస్మార్తాగ్నులు, వాయువు, ప్రాణములు, పుణ్యనదులు, నరములు, పుణ్యవృక్షములు, ఓషధీలతలు రోమములు, పర్వతములు, ఎముకలు, సముద్రములు, కడుపు, సంధ్యాకాలములు, వస్త్రములు, మేఘపంక్తులు, తలవెండ్రుకలును, కలవాడై ఈపదు జగంబులు, తానయైయుండును. హరిరేవజగత్, జగదేవహరిః॥ అనియందువలననే పెద్దలు చెప్పిరి. ఈపరమేశ్వరుడు కానిది యొకటియు లేదు. ఇట్టి బ్రహ్మాండశరీరియగు విరాట్పురుషుని వలన గలిగిన రజోగుణమే బ్రహ్మరూపమును ధరించి సృష్టికిమూలమయ్యెను. ఇమ్మహాత్ముని సత్వగుణమే విష్ణురూపమును, ధరించి జగత్పరిపాలనము సలుపుట యారంభించెను, ఈబ్రహ్మాండ పురుషుని తమోగుణమే రుద్రుడై జగల్లయము సలుపుచుండెను. అయితే, వీరును నామరూపములు గలవారి వలె దోచినదోతురు గాని నిజమునకు పరమాత్మ స్వరూపులే గనుక వీరికవి బ్రహ్మమునకు వలెనే లేవు. అట్టి దేవతల్ప్రపంచమున నెట్టి రూపములతో నున్నారందురా? దారులోహ శిలావిగ్రహ రూపములతోనున్నారు. ఆయా దేవతల నాయా రూపములుగాగల విగ్రహముల నర్చించి యెందరెందరో

కృతార్థులయిరి. రాతిబొమ్మలు దేవతలగుదురాయని. మీారం
దరా! వినుడు, శాస్త్రమునందు మహామంత్రము లందక్షర
బుద్ధియు, గురువులయందు మనుష్య బుద్ధియు, విగ్రహము
లందు శిలాదార్వాది బుద్ధియుగల పాపాత్ముడు కుంభీపాకాది
నిరయముల పాలగునని చెప్పియున్నది. గనుక, ప్రతిమాదు
లందు శిలాబుద్ధి యెవ్వనికి తగదు. అట్లు దేవతావిగ్రహములు
శిలలని నిరసించు నెడల మహావేత్తలగువారే లక్షలు, కోట్లు
ధనము వెచ్చించి దేవళముల కట్టించి ధూపదీప నైవేద్యము
లకు పితృపితా మహీయములగు మాన్యంబుల సమర్పించి
శాశ్వత కైంకర్యముల జేయించి కృతార్థులై యున్నారు.
అయితే, వేమన, రాళ్లు దేవుళ్లైతె రాసులు మింగవా, అని
చెప్పి యున్నాడుగదా యందురా! నిజము, మనముకూడ
వేమనయంతజ్ఞాన సంపన్నులమైనయెడల నట్టిభావనయే
చేయుటముఖ్యమే

యావచ్ఛరీరాది షుమాయయాత్మధీః।
తావద్విధే యోవిధి పాదకర్మణాం॥

అనగా, మాయచేత నెంతవరకు శరీరాదులయం దాత్మబుద్ధి
యుండునో అంతపర్యంతమును, విధ్యుక్త కర్మలకు విధేయుడై
యుండవలెను, నిదుర లేచినది మొదలు దైవస్వరూపులగు
ల్లి దండ్రుల ధిక్కరించి బడితె పూజలుచేయుచు, భార్యా
ఃఖం॥ సకలదుఃఖాల వాలమగు భార్యను. కుల దేవతలా
ఎన పూజించుచు, ఋణ స్వరూపులగు పుత్రి పుత్రికల కష్ట
ష్టములబడి సుఖమొనగూర్చు, పర ధనముల కపేక్షించుచు,
పెద్దల నెగతాళిజేయుచు, వేదశాస్త్రముల కపార్థముల

నూహించి నిందగూర్చుచు, వాచిక, కాయిక, మానసిక, హింసలచే నితరుల నుడికించుచు, కాలము వ్యర్థముచేయు, మానవహీనులు, భగవద్విగ్రహముల, బూజింపక, అనంత కల్యాణ గుణధాముండగు పరమేశ్వరుడే, యీవిగ్రహమని విశ్వసింపక యేమయిపోవునో యూహింపుడు. వెనుకటి జన్మలయందైన నించుక పుణ్యమయిన నొనరించి యెఱుంగనిదే, యీజన్మమున భగవత్తత్వము, చెవిదూరని కారణము. ఎట్లయిన, సుధామధ్యా నగరిస్థుడైన హరిజెందర్ వచ్చుధాత్రీశ్వరా! అని పోతనామాత్య భక్తాగ్రేసరుడు చెప్పినట్లు, భక్తిపూర్వకముగనో లేక, నలువురు తనను భక్తిపరుడని చెప్పవలెనను తలంపుతోనో లేక పూజింపబడు విగ్రహమే, తనయుపాస్యదైవమను గాఢవిశ్వాసముననో, ఎట్లో, సర్వాంగసుందరంబగు భగవద్విగ్రహమును, ముందుంచుకొని శక్తికొలది, యావిగ్రహమును, విభూషణాంబర పుష్పమాలికలచే నలంకరించి విధ్యుక్తముగ షోడశోపచారములనన్యభక్తివివశుడై సలిపి అన్యథా శరణంనాస్తి, త్వమేవశరణంమమ అని భక్తానందాశ్రువుల నించుచు గద్గదకంఠుడై శరీరమున పులకాంకురంబు లుత్పన్నములగుచుండ సాగిలబడి తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్ధనా అని యేడ్చెడి, వానిని పరమేశ్వరుడు దయామయుడు, భక్తపరాధీనుడు, దీనవత్సలుడు, అనాధనాధరక్షకుడు. విని యూరకుండునా, ఊరకుండడుగాని ఆభక్తుని జభక్తుడేని, క్రమక్రమముగ నతనిని కొన్ని జన్మలకు ముక్తిజెందించును, లేదా! డంబాచారి యయ్యెనేని నతని వాక్కాయ కష్టములు వ్యర్థములు కాకుండ తగిన ఫలమిచ్చి

యాదరించును గాని విడువడు, ఏమీ యీఫలముల నిచ్చునది శిలావిగ్రహమేనా, యనుచున్నారా? ఔను శిలావిగ్రహమే శిలావిగ్రహమునారాయణునకన్యమెట్లగును? బ్రహ్మయు, శివుడునుశక్తియు,నింద్రుడును,సమస్తదేవతలును,లోపలను, వెలుపలను, అంతయును, నారాయణుడు, అతను గానిది కొంచెమయినను లేదు, అని శ్రుతిచెప్పినదిగాని, రాయి, దారువు, లోహము, తప్ప, అని చెప్పినదా! అట్లయిన దారులోహశిలలు మాత్రము చాలవా, భగవంతుడు సిరవయవుడుగదా! ఈయవయవములు నీశృంగారములు. దార్వాదుల కెందుకని మీకు సందేహమా. భగవానుడుసావయవయుడు, నిరవయవుడుకూడ నగును. ధృతరాష్ట్రునికొలువులో మానభంగ మొనరింపదుశ్శాసనాదులు ప్రయత్నించుటయు, ధర్మరాజాదులు ధర్మపాశబద్ధులై మానముద్రదాల్చుటయుదిలకించిభయకంపితగాత్రయై దిక్కులేనివారికి దేవుడేదిక్కనిత్రిశుద్ధిగానమ్మి కోకలూడదీయుచున్నదుశ్శాసనునకు తనచేతులడ్డమైన నొడ్డక రెండుచేతులు పైకెత్తినమస్కరించుచు తన మనస్సును, శ్రీకృష్ణపరమాత్మ పాదకమలములందు నిల్పి...... ద్రౌపది... ఇమామవస్థాం సంప్రాప్తామనాథాంకి ముపేక్ష్యసే, శంఖచక్ర గదాపాణే, ద్వారకానిలయాచ్యుత, గోవింద పుండరీకాక్ష, రక్షమాంశరణాగతాం అని వేడగా "కృష్ణుడు" దృతరాష్ట్రునికొలువునకువచ్చినాడా! దుస్సాసనునితో యుద్ధముచేసినాడా, ఏమియు లేకుండగనే యాపతివ్రతకు మానరక్షణమొనరించి యభయమొసగినాడు గదా! ఆరక్షణమునిరవయవుడై చేసినదికదా, మహారణ్యములోని సరసులోనున్న మకరికిజిక్కి గజేంద్రుడు, రావేయాశ్వర

కావ వేవరదసంరక్షించుభద్రాత్మకా, అనిదీనుడై కేక బెట్టినపుడు సిరికింజెప్పడు; శంఖచక్రయుగముగ్, జేయిసంధింపడు, అని గదా, మహానుభావుడు, పోతనకవివ్రాసినది! అప్పుడుసావయవుడై రక్షించినాడనుట నిస్సందేహము. గనుక, మనకిప్పటికాసందే హానివృత్తియైనట్లే బాబులారా, యింకొక మాట చెప్పెదను యిందుగలడందు లేడని సందేహమువలదు. చక్రిసర్వోపగతుం డెందెందు వెతకి చూచిన! నందందే గలడు దానవాగ్రణి వింటే. అని గదా! ప్రహ్లాదుడు చెప్పినాడు, అందువలన గూడ విగ్రహాదులయందు గూడ భగవానుడున్నాడనుటకు సందేహమెందుకు "అయితే" పూజకుని యందుమాత్రమా నారాయణమూర్తిలేదా! అని మీరనుట తప్పుగాదు ఎందు కందురా! నారాయణుడు పూజకుని యందుండుటేమిటి? అతడే నారాయణుడు అదియుదాగ్గనే 'జీవబుద్ధ్యాస్తుదాసోహం' అని కదా తనకంటె భగవానుడన్యుడని తలంచెడి వివేకములేని వానికే ఈవిగ్రహారాధన యేర్పడినది. ఈవిగ్రహారాధన యైనను; ధ్యానమయినను, మరియొక సత్కర్మయేదియైనను చేసి నిశ్చలమనస్కుడే పూర్ణఫలమనుభవింపగలడు. సర్వకృత్యములు చేయుటకు త్రికరణములే కర్తృత్వములైనను ఆమాటిలో ప్రథమకర్తృత్వము మనస్సునకేకలదు. మంచి గాని చెడుగాని, తాజేయుచు వాక్కాయములచేత, నదిచే యించును. చిత్రవిచిత్రములుగా సంచరించును. శ్లో॥ మనఏవ మనుష్యాణాం। కారణంబంధమోక్షయోః। యాభ్యామాలిం గనంభార్యాం। తాభ్యామాలింగనంసుతాం॥ మనుష్యులకు బంధమోక్షములకుమనస్సు కారణము. ఏ చేతులతో భార్యను

కౌగలించుకొనుచున్నాడో. ఆచేతులతోనే తన కన్నకుమా ర్తెను కౌగలించు కొనుచున్నాడు. తన చేతులతో భార్యను కౌగలించుకొని తాను దుర్వృత్తి ననుసరించి బంధమునకు లోనగును, కూతుని కౌగిలించుకొన్నపుడు సద్వృత్తిననుసరించును. గనుక, పూజాపునస్కారములేవి చేసినను, మానవుడంతఃకరణ పారిశుధ్యము కలవాడై చేయవలయును. అట్లు చేయ లేడేని పూర్ణఫలము పొందనేరదు. మనకు కాలమా తీరి పోవుచున్నది, ఆయుః ప్రమాణమా నానాటికి హిమవాలుక మట్లు హరించిపోవుచున్నది. లోకము తమబిడ్డలింకను పెద్దవారుకాలేదని చింతింతురుగాని, పెద్దవాడగుట యనగా నాయుః పరిమాణములో నొక్కొక్కయేడు తరిగిపోవు చున్నదని విచారింపరు. 'ఇది ప్రకృతి వైచిత్ర్యము. ఈపిన్నయగుట పెద్దయగుట, శరీరమేకాని, యాత్మకు పిన్న, పెద్దరికములులేవు. అది స్థూలముకంటె స్థూలము. సూక్ష్మమునకంటె సూక్ష్మము పెరుగుట, తరుగుటయనునవి యాత్మకెన్నటికిని లేవు. మాయా పరిభ్రమితుడై జన్మాంతర కృత పాప పుణ్య మిశ్రిమ కర్మల మూలకమునకురూపిగానో, సురూపిగానో జన్మించి, శైసవమున, జననీ జనకుల రక్షణలో నుండి, పొత్తికలలో మూత్రపురీష ముల విడచుచు నందుబడి పొరలాడుచు, కేవలజననీ స్తనదుగ్ధ పానముననే పెరిగి, బాలుడై యాటలతో ప్రొద్దుపుచ్చుకొని యౌవనము రాగానే, స్త్రీ సంభోగాది కృత్యముల ప్రొద్దు పుచ్చుకొని, జరాభారపీడితుడై నా నా రోగములు తన్ను పీడించుచుండ, ప్రాణమునకంటె ప్రాణముగా, చూచుకొన్న తన భార్యయు, అతి ప్రేమగా, బెనుచుకొన్నపుత్ర పుత్రికా-

వర్గమును, తన వంక చూడక, పిలచినను బలుకక, కసరి కొట్టుచుండ మంచమునబడి, కృషించి కృషించి ఈశరీరము గతించును. జీర్ణమయిన వస్త్రములను, విడచి క్రొత్తవస్త్రములను నరుడెట్లు గ్రహించుచున్నాడో, అట్లే జీర్ణత్వమును, పొందిన దేహమును, విడచి దేహి, మరియొక దేహమును, ధరించుచున్నాడనుట, నిక్కమేకదా! జీవుడా, శరీరము పడిపోగానే కర్మానురూపమగు మరియొక శరీరమును గ్రహించును అంతియేగాని తాను మాత్రమెన్నటికి జీర్ణత్వమును బొందక స్థూలమును, వదలి సూక్ష్మశరీర మాత్రుడై తానొనరించిన పుణ్యపాపమిశ్రమ కర్మఫలముల ననుభవించుటకు, లోకాంతరమునకు బోయి యచట కర్మఫలముల ననుభవించి యనుభవానంతర మాలోకములను, వదలి యాకాశములోనికి వచ్చి క్రమముగా భూతావతరిణంబువలె నయ్యాకాశము నుండి, వాయువులోనికి వచ్చును వాయువులోనుండి యగ్నిలోనికి వచ్చును. ఆ యగ్నిలోనుండి జలము లోనికి వచ్చును. ఆజలమునుండి వర్ష మూలమున భూమి లోనికి వచ్చును. భూమి నుండి ఓషధులలోనికి వచ్చును. ఓషధుల వలన నుండి యన్నములోనికి వచ్చును. అన్నమనగా, బ్రతికింపజేయునది యని యర్థముగనుక, ఏజీవగణ మేపదార్థము గ్రహించునో, ఆయా పదార్థములెల్ల యన్నములేయగును. కావున నీలోకాంతరము నుండి వచ్చిన జీవుని పూర్వకర్మ లేశరీరము రాదగియున్నదో, ఆశరీరమునుగనుట కర్హమగు, జీవరాశితినదగిన, యన్నములో మిళితుడై యుండును. ఆయన్నము, నాజీవమిథున మారగించిన వెంటనే యది జీర్ణమై తచ్ఛుక్ల శోణితములై రతి సమ

యమున రెండును, మిశ్రితమై మాతృగర్భమున, నండము గానో, పిండముగా వృద్ధియై యాకృతి దాల్చిన శరీరమున తాజేరి తన్మాతృగర్భస్థములగు, మలమూత్రములలో రక్త మాంసములలో పొరలాడుచు, వాకొనుటకు కూడ నసహ్యాకరమగు గర్భ నరకమున ననుభవించుచు, నంతపర్యంతమును పూర్వజ్ఞానము కలిగియుండి, యిక నెన్నటికి నిట్టిపాపముల జేయను. ఓభగవానుడా! నన్ను దరిజేర్చుమని ప్రార్థించుచు, తజ్జనయిత్రి భుజియించిన పదార్థములలోని రసమున బెరిగి, పెరిగి, నవమాసములునిండగానే, తల్లిగర్భములోనే,మాయచే నాచ్ఛాదింపబడి యెట్లో బహిర్గతుడగును, మరల చీరెకు కండె మొదలన్నట్లు, మునుపటిమాదిరిగానే, పెరిగి, పెద్దవాడై పరమార్థజ్ఞానశూన్యుడై తనగతి తానెఱుంగక, పశు ప్రవర్తనమున గ్రుమ్మరి, మరల చచ్చును. మరల బుట్టును, ఈచచ్చుటకు, బుట్టుటకు, పారముండదు. వాని వాని యదృష్టవశమున సత్త్వగుణ మొక్కించుకయైన గలవాడై యున్న యెడల నతడు మెల్ల మెల్లగా నూర్ధ్వగతుడగును. అనగా, కొంచెము, కర్మానుష్ఠానపరుడో, లేక భగవద్భక్తిపరాయణుడో యగును, క్రమక్రమముగా, కొన్ని జన్మలు గడచిన తుది జ్ఞాన సంపన్నుడై ముక్తిని పొందనవకాశము గలవాడగును. రజోగుణ సంయుక్తుడైన యెడల నింద్యుడై నింద్యవృత్తికిలోనై పుణ్య మొనరించువాడు గాక, మహాపాపులలోను జేరక, ఊర్ధ్వగతుడును, అధోగతుడును, గాక మధ్యస్థుడై యుండును. తామసులు, క్రూరకర్ములై దురంతరములకు వెనుకాడక, దురహంకారులై,దుష్కర్మరతులై మృగముల లాగున

నెట్లో బ్రతికి యంతకంతకు నధోగాములగుదురు. మానవ లోకము నిన్నితరగతులుగా మార్చి కొందరి నధోలోకము లకు, కొందఱి నూర్ధ్వలోకమునకు, కొందఱిని పరబ్రహ్మై క్యానందమునకు బంపునదియేదో కొంచెమూహించిన యెడల మనస్సని తెలుచున్నది. ఆబుద్ధిని మనము ప్రయత్నించి నిలువ బెట్టుకొన జాలితిమేని, మనము కృతార్థులము కాగలము అయితే, "బుద్ధిఃకర్మానుసారిణి" అని పెద్దలందురుగదా! కర్మఫలము జీవుడనుభవింప వలసినవాడై యుండుటయును, బట్టి వాని బుద్ధి కర్మానుసారముగా, నడచుచుండ దానిని మఱియొక త్రోవకు ద్రిప్పుటకు సాధ్యముకదా! అదియును గాక, 'వాయోరివ దుష్కరం' అని శ్రీకృష్ణభగవానునకు, ప్రాణసంఖుడగు, నర్జునుడే యన్నాడు. ఇక మనవంటి వారి కది యెట్లు నిలుపసాధ్యమగునని విచారనవచ్చును. చెప్పెదను వినుడు, "నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుంగు" అనియొక కవిచాటు పద్యములో చెప్పియున్నాడు. నీటిస్వరూపము చేత నది యెప్పుడు, పల్లపు కాల్వనే బడిపోవుచుండు, మనకు మెఱక చేనికా నీటి నెక్కింప ముఖ్యావసర మయినప్పుడు నీటిని పల్లపుకాల్వకు పోకుండ నడ్డివైచినప్పు డానీటికి ప్రవ హించుట స్వభావము గనుక, నడ్డికట్టిన కారణమున పల్లము నకు బోలేక మెరక లెక్కి నిలుచును, ఆనిలచిన నీటిని మరల పల్లమునకు బోకుండ ప్రయత్నించి మనము నిలుపుదుముకదా అట్లే బుద్ధికిని కర్మానుసారముగా బోవుట స్వభావము. అట్లు పోవు బుద్ధిని మనము ప్రయత్నించి అడ్డుపెట్టిన యెడల చం చల స్వభావముగల మనస్సు మెరక భూమిని నీళ్లునిలచినట్లే

పోవు స్వభావ మార్గమరి కట్టబడియున్నందున పరమార్థము వైపునకు దిరిగి. మన యత్నమున పరమార్థమునందే నిలబడి యుండును. 'ఇదియునుగాక' మనస్సు దొంగపసరము వంటిది ఆదొంగపసరమునకు. దొంగ మేతమేయుటయే, యలవాటు ఎంతమంచి మేత ముందువేసినను, తినక కొంచెము నమిలి నట్లే నమిలి సమయము జూచి పలుపు తెంచుకొని, పొలాల మీదికి పరువెత్తును. అప్పుడా పశువునకు, యజమాని దాని దొంగతనమును, మార్చనెంచి గట్టి కట్టుకొయ్యను, లోతుగా బాతి. లావు, గట్టి, గలయొక క్రొత్త పలుపుతో బంధించి, మేత ముందువేసి నీళ్లకు సైతము విడువక నిర్బంధింపగా నప్పశువు, ముందున్న మేతను, కాళ్లక్రిందికి లాగి దానిపై శకృన్మూత్రంబుల విడచి, రెండు దినములు త్రాడు తెంచుకొన బ్రయత్నించుచు, మేత మేయకుండి యటు మీద నాకలియైన కొలంది తన కాళ్లక్రింద పరకలను, మెల్లమెల్లగా లాగికొని తినుట కారంభించును. అది గని దాని యజమాని పశువునకు బుద్ధివచ్చుచున్నదని, తెలిసికొని దానినట్లే బంధించియుంచి మేపుచు రాగా రాగా నప్పశువు, దొంగమేత మఱచిపోయి సాధువై యింటబడి యున్నట్లు, మనస్సును కూడ నవిషయవాసనలమీదికిపోకుండ జేయుటకు, పురుషయత్నము ముఖ్యముగా, నుండవలెను. పురుషయత్నమువలన నది దుర్విషయాదుల మీదికి పోవుట మఱచి పరమార్థమునకభిముఖమై పరమార్థవిచారణలో బ్రవేశించి తుదకదే పరమార్థస్వరూపమయి, ప్రకాశింపగలదు. కావున బ్రహ్మవిచారణమందుపురుషయత్నముచాలయవుసరము పురుషయత్నము

లేనిది, మనస్సువశమైనట్టికిని కాదు, అందువలనే భగవానుడు, అభ్యాసయోగముచేతను, వైరాగ్యముచేతనుగాని, మనస్సువశముగాదని చెప్పినాడు. ఆమనస్సునీకువశమైనడగునో ఆనాడు నీకనాత్మస్ఫూర్తి యుండనే యుండదు. అనాత్మస్ఫూర్తి లేకుండుటయే, ముక్తి అని శాస్త్రము చెప్పుచున్నది. ఇదిగో వినండి, "విపరీతాత్మతా । స్ఫూర్తిరేవముక్తిరి తేర్యతే" అనగా, విపరీతత్వముగల ఆత్మత్వము, అనగా, ననాత్మ. అది స్ఫురణకు రాకుండుటయే ముక్తి అది యెల్లప్పుడు సమాధి చేయు వారికేగాని యితరులకు సాధ్యముకాదు, నాయనలారా ఇది బ్రహ్మవిద్యా, అని యందురుకదా! అనగా, సాధ్యపడుట కష్టమని యర్థము చేసికోవలెను. సాధ్యముకాని దానినిగూర్చి మాకుపన్యసించుట ఎందుకయ్యా అందురా? మన వేమన యోగి చెప్పిన మాటకూడ, వినండి. ఆయన "సాధకమున బనులు సమకూరు ధరలోన" అని చెప్పినాడు గనుక, ఎత్తుటకు దుర్లభమయిన మనుష్య జన్మయెత్తి పరమార్థమునకు పాటుపడనియెడల నేమయిపోవుదుము? ఈజన్మ మనకు మరల లభించుననుట నిజమా? కావున, మానవుడైపుట్టిన ప్రతివాడును పరమార్థవిచారణ మందాసక్తి గలవాడు కావలెను.

## ప్రశ్నోత్తరములు

ప్రశ్న...జ్ఞానమార్గమునందు బుద్ధిప్రవేశింపని వారికేగత్యంతరమును లేదా?

ఉత్తరము... లేకేమి? భక్తిమార్గముకలదు. మీరడిగినప్రశ్న మిగుల సంతోషకరమయినది. జ్ఞానమే మోక్షము. మోక్షమే జ్ఞానము. ఆరెంటికిని అవినాభావ సంభంధము అట్టిజ్ఞానమును పొందవలెనంటే, ఈశ్వరానుగ్రహా దేవపుంసామద్వైతవాసనా

అని పెద్దలు చెప్పినారుగనుక, పరమేశ్వరానుగ్రహము పొందుటకుజ్ఞానధనమునార్జించుటకుముందు భగవద్భక్తిప్రధానమయినది. ఆభగవంతుడు, పరమాత్మయు నొకటియేయని మీకిదివరకు చెప్పియున్నాను. భగవంతుడుభక్తిసులభుడు, కరుణాసముద్రుడగుపరమేశ్వరునివలన ననేకులు తమవాంఛితముల నొందియున్నారు. వారినందఱును, వాకొనుటకు నేనుసమర్థుడను కాను కానియనన్యభక్తి సలిపి భగవత్ప్రసాదమున కృతకృత్యులైనవారిని కొందరిని మాత్రము చెప్పుచున్నాను. భగవద్భక్తి కూడగతజన్మలయందుండిన గాని యీజన్మమున గలుగుటకలుగును, గతజన్మలయందు నుండి తన నర్చించుచు వారిని సర్వజ్ఞుడు కావున భగవానుడు వారి కష్టముల ననాయాసముగా తొలగించుచుండును. పాండవులను లక్క-యింటిలోబెట్టి నడిరేయి నిప్పు పెట్టించి దుర్యోధనుడు, వారిని చంపజూడగా, తత్కాలమున కేదో నెపమున శ్రీకృష్ణభగవానుడు, వారలరక్షించెను దుర్యోధనుడు, భీమునకు విషాన్నము పెట్టించెను. నిదురబోవు వానిని కాల్సేతులంట గట్టించి గంగలో పడద్రోయించెను. ఆసమయమున భీమసేనుని రక్షించినది, భక్తవత్సలుడగు భగవానుడుగాక, యెవరురక్షించిరి? దుర్యోధనుని పనుపున దుర్వాసుడు పాండవులరణ్యమున నుండగా, ననేకులగుసాధువులతో వచ్చి యాతిథ్యమడుగగా. నమ్మహారణ్యమున నిస్స్వనులైపడియున్న పాండవులచే మహాచండకోపియగు దుర్వాసునకు, తదనుచరులకు నాతిథ్యము కొఱతలేని చందమున, ఇప్పించి యాతని శాపాగ్నికి, పాండవుల నప్పగింపక కాపాడినది, భగవంతుడగు, శ్రీకృష్ణుడేకదా! మఱియు, ద్రౌపది

మాన సంరక్షణ మొనరించెను. మఱియు, భీష్మ, ద్రోణ, కర్ణాశ్వద్ధామ, కృపాచార్య రక్షితంబగు సుయోధనుని, పదునొకండ క్షోహిణుల సేన నవలీలగా, జయించునట్లుచేసి ధర్మసూతికి పట్టాభిషేకమహోత్సవ మొనరించి పాండవుల నేలినవాడయ్యెను. మరియు నవ్యాజ కరుణాన్వితుడై అడుగ కుండగనే కుచేలునికి జ్ఞానైశ్వర్యముల రెంటి నొసగెను. భక్త శిరోరత్నంబగు ప్రహ్లాదుని తండ్రివలన బాధనుండి కాపాడెను పగవాని తమ్ముడని భావింపక విభీషణుని రాక్షసరాజును చేసెను. తండ్రి యొనరించిన యవమానమును భరించలేక పిన్నతనముననే, తన నాశ్రియించిన ధృవునికి, శాశ్వతపదవి నొసగెను. మనమిట్టెందరిని పేర్కొనగలము? ప్రపంచ మంతయు భగవద్రక్షితమే, అట్టి సర్వరక్షకుడు సర్వనియా మకుడు సర్వాంతరయామియునగు, పరమేశ్వరుని ధ్యానింపని మనుజుని జన్మము పశుతక్ష్యాదుల జన్మకంటెకూడ నతినీచ మైనది. "విష్ణుభక్తిలేని విబుధుండు, విబుధుడే పాదయుగము తోడిపశువుగాక" అనిమహాత్ముడు వ్రాసినట్లు వాత పరమ సత్యము. ఆభక్తియు ననన్యమై, యేనాటికిని చలింపనిదై యుండ వలెను. మనకు తరించుమార్గములు రెండు గలవు. భక్తి మార్గము. రెండవది జ్ఞానమార్గము. ఆజ్ఞానమార్గమునకు కూడ నత్యంత సహకారికాబట్టియే 'శ్రీమచ్ఛంకర భగవత్పాదా చార్యులుగారు' వేనేశస్యవిధీయతామ ముపచితిః, ముందుగా వేదశాస్త్రము లభ్యసించి ఆయభ్యసించిన వేదశాస్త్రోపదిష్ట మార్గముచే నీశ్వరారాధన చేయుమని చెప్పినారు. ఆయీ శ్వరారాధన యేవిధముచేతనైనను, పూజకుని కృతార్థుని

చేయుటకు మిక్కిలి సమర్థతమైనది. గనుక, భగవతారాధన చేయునపుడు. భగవత్పరిచర్య చేయునపుడు, భగవన్నామ సంకీర్తనము చేయునపుడు, భగవద్దివ్య మంగళవిగ్రహమును హృదయపీఠముననిల్పికొని యితరములజూడక, యితరముల తలంపక, అంతశ్చక్షువుల పాదయుగమును దర్శించుచు శరీరమున రోమాంచలములుప్పతిల, కనుల వెంటనానందబాష్పము లనీగుచు, శృతిలయాదులు తప్పుటెఱుంగక మహానందపరవశులై, నామసంకీర్తనము చేయువారేభక్తులువారేధన్యులువారే పూజ్యులువారేజగత్పావనులు, భగవానుడు కృష్ణావతారము స్వీకరించియున్నప్పుడెందెందరు మహామహులు తన్ను సేవించుట లేదు. వారందఱినట్లుంచి భగవానుడుగోపికలఋణమునాకేగ రానిదన్నాడని పెద్దలు చెప్పుదురు. అట్లుభగవానుడనుటకు కారణము లేకపోలేదు. శ్లో॥ విక్రీతుకామాఖిల గోపకన్యాముురారి పాదార్పిత చిత్తవృత్తిః । దద్యాదికం మోహవశాదవోచత్ గోవింద దామోదర కేశవేతి॥ పా॥ (మాధవేతి) గోపికలు పెరుగు, పాలు, మొదలైనవి విక్రయించుటకై ఆయాభాండముల నెత్తిన నుంచుకొని పట్టణములో దిరుగుచు, శ్రీకృష్ణ పరమాత్మ పాదములయందు సమర్పించిన చిత్తవృత్తిగలవారై పెరుగోయమ్మ పెరుగో, పాలోయమ్మ పాలో, అనుటకు బదులుగా, ఆపరమాత్మయందలి మోహమున నోడలెఱుంగక, ఓగోవింద, ఓదామోదర, ఓమాధవా,యని కేకలు పెట్టసాగిరట సోదరులారా! వింటిరా, అట్టిఅనన్యభక్తిపరవశలై యున్నారు. గనుకనే, భగవంతుడు వారి ఋణము తీర్చలేనని యుండవచ్చును. ఎన్ని కబురులు చెప్పినను. బుడిబుడి స్నానములెన్ని

చేసినను, సుద్రాక్షలు, తులసీపూసల పేరులు ధరించినను, శరీరమంతయు భస్మముపూసికొని వీతరాగుల ననుకరించి మాటలాడుచు అనుభవసూన్య వేదాంత బోధచేయనేర్చి నను, భగవద్దాసులవలె పరమపదమునకు జేరరు భగవద్భక్తి విముఖుడగు వాడెంత పండితుడైనను. లోకమునకు విసర్జనీయుడుగాని వందనీయుడెన్నటికి గాదు.

ప్రశ్న... అన్నా పరమపావనుండగు భగవంతుని యేయేకుల ముల వారుపచరింపవచ్చును?

ఉత్త... ఓయీ నీవడిగినప్రశ్నకు నాకు నవ్వువచ్చుచున్నది పదిమందిలో ప్రశ్నింపదలచినప్పుడు కొంచెమాలోచించి ప్రశ్నింపవలెను. ఇట్టియర్థరహితమగు ప్రశ్న నీవేలయడిగితివో చెప్పెదవిరు.

కులబేధములు గలవారు తమతమ యిండ్లలో శుభాశుభములు జరుగునప్పుడు తమ కులమువారినే, అనగా, తమ తోతుల్యు లగు వారినే యాహ్వానింతురుగదా! పరమాత్మస్వరూపుడగు భగవంతునకు జాతి, నీతి, కులము, గోత్రము, నామము, రూపము, గుణము, మొదలగునవిలేవు కుల గోత్రరహితుడగు భగవానుని ఒకకులమువారని యేమిటి అందరును భజింప వచ్చును. సర్వసముడగు భగవంతుడు భక్తిని గ్రహించును గాని యభిజాత్యమును చూడడు. జ్ఞాన సంపాదనయందును, భగవతారాధన యందును, మానవజాతియంతయు నధికా రముకలదే యగును. కాని వారి వారి యంతఃకరణ పారి శుధ్యము కొలది వారు వారర్హ్వంబులగు పదవులనుభవింతురు

ప్రశ్న... అయ్యా అంతఃకరణజడమని యింతకుముందు

మీరు చెప్పియున్నారుగద? జడమగు అంతఃకరణకు పారిశుధ్య మెట్లుకలుగును కలిగినను కర్తృతకలిగి భక్తి యెట్లు చేయును?

ఉత్తరము... బాబూ మీప్రశ్నలు మఘలోబుట్టి పుబ్బలో తేలుచున్నవి. దీనికి కారణము నూహింపజాలకున్నాను, చెప్పదలచి దిగినాను గనుక, చెప్పెదను వినుఁడు; అంతఃకరణజడమనుట సత్యమేయగును. ఈయంతఃకరణమే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అని నాల్గువిధములు కలది గనుక, త్రికరణములలోనిదే యగును. ఆత్రికరణములును ప్రత్యగాత్మ సన్నిధానమును పొంది యా యా యుపనుల యందు ప్రవర్తించుచుండును. వికారరహితమైన ప్రత్యగాత్మ యేపనులను జేయదు. చేయవలయునను సంకల్పముసుకూడ దానికిలేదు. ఇక నేమనగా, చిల్లులు గల కుండలోనున్న దీపముతనప్రకాశమునురంధ్రములద్వారా నెట్లుప్రకాశమును బహిర్గతముగా నెట్లు చేయుచున్నదో అట్లే బ్రహ్మమును. కన్నులు మొదలగు నింద్రియముల ద్వారా బహిర్గతమగు నంతఃకరణతో మిళితమై యుండునే కాని యితర మెరుగదు. జలము కాలువలో నుండి తూములో ప్రవేశించి ఆతూముద్వారా మాగాని మడిలోనికి ప్రవేశించి ఆమడి ముక్కోణముగా నున్నయెడల ముక్కోణాకారముగాను, చతుష్కోణముగా నున్న మడియైన యెడల చతుష్కోణాకారముగాను, నెట్లగుచున్నదో అట్లే స్వాధిష్ఠానచిదాభాసుడైన సజీవునితో గలసియున్న యంతఃకరణమే దృశ్యమునబడి తదాకారమై పరిణమించును. దీనినే యంతఃకరణ వృత్తియని పెద్దలు పేర్కొందురు. గనుక, చిదాభాసుడగు జీవునితో గలసికొని త్రికరణములు పుణ్యపాప

మిశ్రిమ కర్మలను జేయుటకు చాలును గాని స్వతంత్రించి యేమియు చేయజాలవు. చేయజాలిన యెడల నవి సుషుప్తిలో కూడ చేయవలసిన దేకదా! నిదురయందింద్రియములకు బాహ్యార్థజ్ఞానము లేదు. మనస్సునకుకూడ, కర్తృత్వాదులును లేవు గనుక, అప్పుడేమియు చేయజాలవు. అయితే, విషయ సంగిగాని యాత్మకు విషయవ్యాసంగంబులగు నింద్రియాదులతో సంగమేల? అందురా, విషయాదులతోగాని విషయ లాలసంబులగు నింద్రియంబులతోగాని మఱిదేనితోగాని ఆత్మకు సంగమనునది లేనేలేదు. సాక్షిత్వమున్నది అదిసర్వదా, సర్వ విషయము లందుకూడ కలిగియే యున్నది జలము, నదిలోను నదియందు బుట్టిన తరంగములలోను, ఆతరంగంబులనుండి పైకెగయు బిందువులలోను. బిందులపై వీచెడి గాలిలో గలిసి పోవుశీకరములలోను. ఎట్లున్నదో అట్లే సాక్షియును, చిదాభాసుడగు జీవుని బాల్యాద్యవస్థలందును, జాగ్రత్స్వప్నసుషుప్తులందును, మనస్సు దుష్టమై దుర్విషయముల బ్రవేశించునప్పుడును, ఆమనస్సే అదుష్టమై యున్నప్పుడుకూడ కలిగియే యున్నాడు. అట్లయిన త్రికరణ నిష్ఠంబులగు వ్యాపారంబులాత్మనిష్ఠములుగా దోచుటెట్లందురా! అవివేకులకవి యాత్మనిష్ఠములుగా తోచునుగాని యదార్థమునకవి యాత్మనిష్ఠములెన్నటికి కావు మన మొక పడవమీద ప్రయాణము చేయుచున్నప్పుడు పడవ వడివడిగా నడచుచుండగా, పడవలోనున్నవారికి పడవ నిలచియున్నట్లును, తత్తీరస్థంబులగు చెట్లువడిగా బరువెత్తుచున్నట్లును తోచుటలేదా! చంద్రుని దెసమనము చూచునప్పుడు వాయువశమున మేఘములు పోవుచుండ

చంద్రుడు పరుగిడు చున్నట్లు తోచుటలేదా! 'అట్లే' త్రికరణములును చేయుకార్యములకు దేహేంద్రియాధ్యాసచే నాత్మకర్తృత్వ మారోపింపబడినది. ఆకర్తయు నభోక్తయు నగు పరమాత్మ కేదియును లేదు. అజ్ఞానముచేత కర్తృత్వ మాత్మ యందారోపించినంత మాత్రమున నది యెన్నటికిని కర్తృత్వము భోక్తృత్వము కలదికాదు. ఎండమావుల ప్రవాహములో మునిగి తడియుట యెన్నటికయిన కలుగునా? దృష్టికల్పిత దోషమున శంఖము పచ్చనిదియగునా! మూఢత్వమున నాకసమున నీలత్వము కల్పించినంత మాత్రమున నాయాకాశము నీల వర్ణముకలదగునా! కాదు అట్లే అధ్యాస దోషమున పరమాత్మయందు కల్పితమయిన కర్తృత్వమును నిజముకాదు. గనుక, సుకర్మదుష్కర్మలను దేహేంద్రియాదులే చేయుచున్నవి. జడములుకదా యందురా! జడములే, ఆత్మశక్తి వ్యాపకమున జేయుచున్నవి. అయ్యాత్మ శక్తివ్యాపకమున రాగద్వేషాదులు త్రికరణములచే త్రివిధకర్మలను చేయించుచున్నవి. అట్లయిన రాగద్వేషాదులు మాత్రముజడములు కావా... జడములు జడములచే పనులు చేయించుట కలదాయని మీరనవచ్చును. చెప్పెదను నదీజలములు తమ వేగముచే నొడ్డున నున్న చెట్లను వేళ్లతోగూడ కూల్చుట లేదా, వాయువు తన వేగముచే, జెట్లను కొంపలను పడగొట్టుటలేదా, అట్లే జడములగునవియు కర్తృత్వము కలవి యగుట తప్పగాదు.

ప్రశ్న... అయ్యా... దేహేంద్రియాదులు జడములని తెలిసియు; నట్టి దేహములు నశించిన పిదప పుత్రులు చేయు

చుండెడి యుత్తరక్రియ లెవరిని గూర్చి?
ఉత్తరము... బాబూ మీరడిగిన ప్రశ్న బాగుగానున్నది. చెప్పెదను సావధానులై వినుండు పుత్రులు తమ్మకన్నతండ్రి యను గాఢవిశ్వాసముతో నెవరిని పూజించుచుండిరో అట్టి తండ్రి శరీరచ్యుతి బొందిన తరువాత తండ్రినిగూర్చియే యుత్తరక్రియలు చేయుచుండిరి అయితే, ఆతండ్రి ఈశరీరమేనా యను చోట నేమనముకొంతచర్చింపదలచియున్నది. ఏమనిన ఆతండ్రి యొక్క శరీరమే తండ్రియైన యెడల పుత్రులాశరీరమును పరుండబెట్టి యతనిపైబడి అనగా, నిర్జీవమగు కళేబరముపైబడి ఓతండ్రి మాకొఱకై పడరాని కష్టములు పడి మమ్ముసాకిపిన్నవాండ్రమగుమమ్మింటిపెద్దలనుజేసి పోయితివే యిక మాకు దిక్కెవ్వరు? మమ్మాదరించు వారెవరు? మాకష్టసుఖముల నెవరితో జెప్పికొందుము? మాపైనకోపమా? మాకు మాఱుమాటయేల చెప్పవని చూచువారికి సైతము జాలికలుగునట్లు శవముపైబడి యేడ్చుట కనుచున్నారము బాబూ, నిజముగా తత్సమయమున ముందున్న శరీరమే తండ్రియైన యెడల తమచే నంతకుమున్ను తండ్రిగా భావింపబడు శరీరమును ముందుంచుకొనియుంత యల్లాడవలసిన కర్మమేలపట్టినది? గనుక ఈయనుభవమును బట్టి చూడగా వారికి తండ్రి ఆశరీరముకాదని స్పష్టమగుచున్నది. శరీరము తండ్రిగానప్పుడు ఆత్మ, నామరూపరహిత సజాతీయ విజాతీయ స్వగతశూన్య సచ్చిదానందా ద్వితీయాపరిచ్ఛిన్నుడై యుండునప్పుడా జనకశబ్దవాచ్యు డెవడందురా! సూక్ష్మశరీరియే జనకత్వముచే చెప్పదగినవాడు స్థూల సూక్ష్మకారణశరీర

ములు మూడును నశ్వరములే యని చెప్పితిరికదా స్థూలముతో పాటుగా సూక్ష్మకారణములు నశింపవాయనిసందేహామురావచ్చును. స్థూలములతోపాటు సూక్ష్మకారణములు నశింపవు. శ్రీనివాసుడనునాతడు భ్రమచేతనకెప్పుడేరంగుగుడ్డల పైబుద్ధిపుట్టునో అప్పుడాయారంగుగల వస్త్రములనుధరించుచున్నవి చెడగానేమఱియొకవస్త్రములనుధరించుచు ప్రాతగుడ్డలను విడుచుచు తాను శ్రీనివాసుడుగానే, యున్నట్లు ఒక జీవుడొక సూక్ష్మమునుపాధిగాఁగొని లెక్కకు మీరిన స్థూలముల కర్మానుగుణముగా దాల్చుచు విడచుచు నుండును. ఆప్రకారంగానే స్థూలశరీరము లెన్నియేని వచ్చుచుండును. సూక్ష్మమొక్కటిగానే యుండి ఆవచ్చిన స్థూలముతో త్రివిధకర్మలు చేయించి యాయాశరీరములు పడిపోగానే తాను లోకాంతరాగమన గమనములుచేసి తాబోయిన లోకమున ననుభవింపదగిన సుఖ దుఃఖముల ననుభవించుచు, మరల మరల స్థూలోత్పాదనము చేయుచుండును. సూక్ష్మ శరీరమెట్లు చేయించునందురా! ఆత్మ సూక్ష్మశరీరమునకు పదియారవ యవయవముగుట వలన నాత్మయు, అంతఃకరణ ప్రతిబింబితుడగు జీవుండును గలిసి తప్తమయిన యినుప గుండు అగ్నిమయంబయిన చందంబున నై సూక్ష్మము స్థూలముచే కర్మల చేయించు చుండును. కాబట్టి ఈస్థూలమునుండి వెడలిపోయిన వాడే అనగా, నంతఃకరణ ప్రతిబింబితుడే మోహా వశమున పుత్రులకు తండ్రియని తోచువాడు కాని స్థూలశరీరము తండ్రి గాదు. ఎందువలన కాదందురా! నాకాలు, నాచేయి, నాకడుపు, నాప్రాణము, నామనస్సు అని వ్యవహరించుటచే స్థూల

యున్నదిగనుక స్థూలమున కేయ కర్తయును లేదు. అరహాత లేని శరీరమునకు పుత్రాదులుపచరించుట యెందుకనిన, రాజుగారిని సంతోష పరచుటకై యతడుండునగరు నలంకరించుటవలె, ఆశరీరములోనున్న వానిని సంతోషపరచుటకై యాశరీరమునుపచరించుటయగును. ఆశరీరమునకుదహనాదిసంస్కారము లెందుకనిన ఆదినుండియు తండ్రిగా భావించి పూజించుచున్నారు. గనుకను, శాస్త్రిమాదేశించినది గనుకను సంస్కారము చేసి తీరవలెను. తరువాత నతని గూర్చి యిచ్చిన తిలోదక, వాసోదక, పిండదానధర్మములతని జెందుననియు తన్మూలమున ప్రేతత్వ నివృత్తియై యతడు స్వర్గాది పుణ్యలోకము లనుభవించుననియు శాస్త్రిములు చెప్పినందునను "యత్తదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరేజనాః। సయత్ప్రిమాణంకురుతే। లోకస్తదనువర్తతే। అనెడి భగవద్వాక్యము ననుసరించి గొప్ప గొప్ప విద్వాంసులే భక్తిపూర్వకముగ బరలోక గతుల గూర్చి యొనరించెడి పద్ధతి ననుసరించియును, భోగసాధనమైన సూక్ష్మశరీరమందలి యధ్యాసవలన జీవత్వము వచ్చిన వారిని గూర్చి అనగా తండ్రినిగూర్చి యుత్తరక్రియలు చేసి తీరవలెను

ప్రశ్న:- విబుధావతంసా! మీరుపన్యసించిన సంగతులువినగా నేమియు తెలియంగని మూఢమతు లెట్లు తరింతురాయని తోచుచున్నది. మూఢులకు సుగతి కల్గుమార్గమున్న యెడల దయచేసి తెలుపవేడుచున్నాను.

ఉత్తరము... జన్మాంతర కృతపుణ్యవశమునగాని మూఢులకయినను జన్మతరించు మార్గమన్వేషింప బుద్ధిపుట్టదు బుద్ధిపుట్టినా తరించుమార్గములు పెక్కులుగలవు అమార్గము లేవి

యందురా తపస్సులు శిలోంచవృత్తి అనగా పరద్రవ్యముల కాశింపక రోటియొద్ద రాలిపడియున్న గింజల నేఱుకొని వాని మూలకముగా తృప్తిపడుట, సత్యమునుపలుకుట పరమార్థ బోధకంబగు శాస్త్రము చదువుట, శాంతవృత్తి కలిగి యుండుట, అంతరింద్రియములని గ్రహించుట, బహిరేంద్రియ ముల నిగ్రహించుట, దానముచేయుట, భగవత్పూజ భగవ న్నామ సంకీర్తనము, భగవత్కథా శ్రవణము, భగవదనంత కల్యాణచరిత్రపఠనము ఇవియన్నియుతపస్సు లేయగును. ఎంత యవివేకియైనను పైని పేర్కొన్న వాటిలో నొక్కటియైన తానా చరింపగలిగెనేని జన్మపరంపరలయినకొలది సత్కర్మాచరణకు పక్రమించితత్ఫలములదాశింపక పరమేశ్వరార్పణము చేయుచు రాగా రాగా కరుణాసముద్రుడగు భగవంతుడాతనియనన్యభక్తి సామ్రాజ్య ప్రవిష్టుని జేయును. కొన్ని జన్మల భగవదుపాసన చేయుచు రాగా నతనికి మోక్షేచ్ఛ గలిగి సద్గురువుల నాశ్రయించి తదుపదిష్ట మార్గమునవలంబించి ముక్తుడగును.

ప్రశ్న... మానవుని యాయువెట్లు క్షీణించిపోవును?

ఉత్త... ఎట్లుక్షీణించునా భరిణలో బెట్టని కప్పురములాగున క్షీణించును. చెప్పెదనువిను ప్రతి జీవునకు నహోరాత్రముల యందిరువది యొక్క వెయ్యిఆరు వందల హంసలు వెడలు చుండును. హంసలుఛ్వాస నిశ్వాసములద్వారా అనగా, లోనికిగాలిపీల్చునపుడుహం అనియు విడచునపుడుసంః అనియుక లదు.గావునను కాలస్వరూపుడగుపరమాత్మనుగూర్చిజపింపనిజ పముస్వభావముగా న దేజరుగుచుంటవలనదీనినజపయందురు. ఇదే ఆయుక్షీణమునకును నాయుర్వృద్ధికికూడ గారణమగును

మూఘలీయ జపమంత్రను సంధాన మెఱుంగక వృథాగ నల్పాయువులు కావచ్చును. మహాత్ములగు యోగులాయు ర్వృద్ధి కలలోనైన దలంపక మహానంద నిమగ్నులై మూలా ధారమునుండి నాదోద్ధానముచేసి వరుసగా నాయాచక్రవళ ములందున్న వర్ణములతో నజపామాత్రకను మేళగించి తత్త చ్ఛక్రముల కధిష్ఠాన దేవతలగు గణపతి బ్రహ్మ, విష్ణు, రుద్ర జీవ, పరమాత్మ, గురుమూర్తులకు నియమిత సంఖ్యా పూర్వ కముగ సమర్పించుచు యోగానందులై జీవన్ముక్తి గాంచు చుండిరి. ఇక వారి యాయుర్భాగ్యములు వారి వారి వశములై యుండును. ఇక నజ్ఞులగువారి యాయువులో సగము నిద్రా రూపమున భుక్తమగును బాల్యమున నాట పాటలతోను, యౌవనమున విధి నిషధములును పాపపుణ్యఫలములును తలంపక విషయ వాంఛావాగురుల జిక్కి వావి వరుస లెఱుంగక స్త్రీ జితుండై కాలమంతయును వ్యర్థముచేసి తుదకు జరావ్యాఘ్ర వదన గహ్వరమున జిక్కియు నాశాపాశము లత్యంతము బం ధింపదార పుత్రపౌత్రాదులు సైతమేవగించి తన నతినీచముగా జూచుటకు వగచుచు చేయునదిలేక కృషించి కృషించి నిర్భా గ్యుడై తన యాయుర్భాగ్యమును వృథాగా నశింపజేసిన వాడగును. బాబులారా మహాత్ములగు వారు సత్కాలక్షే పముచే తమ జీవితమును పవిత్రవంతముగా జేసికొని పోవు దురు, ఏవిధమగు జ్ఞానమును లేని. నరపశువులు పరబాధకంబు లగు సర్పములవలె తమజీవితమును బహుకళంకయుక్తము జేసికొని యసిపత్ర వనప్రభృతి బహు భయంకర నరకము లనుభవించి మరల వచ్చి క్రిమికీటకాది యోనుల బుట్టుచుండు

దుదు. మహాయోగులు యోగాభ్యాసులు పుణ్యకర్మ రచయితలు. వారి వారి సుకృతానుసారముగ పుణ్యలోకముల ఫలముననుభవించి మరల ఎచ్చి శుచి మంతంబులగు ధనికుల యింటనైననులేదా, యోగాభ్యాసుల యింటనైనను జనించి మరల మరల సుకృతములే యాచరించుచు జీవన్ముక్తులగుదురు మొత్తముమీాద నాయుర్ధాయము పుణ్యపాపములను తిరిగి పోవు నదేయయినను మానవుడై జనించినందులకు ఫలమజ్ఞాన నివృత్తిగాంచుటే యగును.

## మాతృకానుసరణము.

# మన జీవితము

ఓసోదర సోదరీమణులారా!

మన జీవితమును గురించి మనము చర్చించి కొంత తెలిసికొనుట ముఖ్యావసరము ఏమందురేని మనము జనించినది మొదలు మరణించు వఱకు చేయుచున్న వ్యాపారములు మన జన్మ సాఫల్యమున కనుకూలమైనవా కావా, యనువిషయము కొందరి కప్పుడప్పుడు తోచినను మనలనావరించి యున్న మాయా పారమార్థిక విషయముల గప్పి పుచ్చుచుండును. గనుక పెద్దల సాంగత్యము చేయుచు వారు చెప్పెడి సదుక్తుల జెవినిడ్డచో మరల కొంచెము మనకాపరమార్థ విషయములు స్ఫురించుచుండును. మనము మాతృగర్భమున నున్నపుడు చెప్పనలవిగానిఘోరనరకమనుభవించియున్నాము. గర్భ

నరకము రౌరవాది నరకములకంటె భయంకరమును సహింప నలవికానిదియు ననుట అతిశయోక్తి కానేరదు. ఏలయం దురా ఆగర్భము చీము, నెత్తురు, మలమూత్రములు, మాం సము మొదలగు దుర్గంధపదార్థభూయిష్ఠమై యుండినట్టి మల మూత్రాదులలోఁబడి పొరలాడుచు నూపిరి స్వయముగా వెడ లక ఆకలి చిచ్చున మలమల మాడుచు తల్లి భుజించిన కట్వామ్లలవణ పదార్థముల సారము తనకు గ్రహింప నసహ్య ముగా నుండియు నంతకంటె నితరపదార్థములులభింపమికి దుఃఖించుచు గత్యంతరము గానక తుదకు మాతృ భుక్త పదార్థరసమునే యారగించుచు కదలుటకు మెదలుటకు వలను పడక మూట కట్టినట్లు జానెడుస్థలములో నిరికికొని పడియుండి యచటి దుర్వాసనల భరింపజాలకుండియు నాఘ్రా ణించి తీరవలసిన యవసరముగలిగి గాఢాంధకార పరిమిత మగు కాశయమున నుండి దిక్కుగానక యించుక పూర్వ జ్ఞానము కలిగియుంట వలన పరమేశ్వరా నన్నీ గర్భనరకము నుండి వెలుపలికి జేర్చుము అట్లు చేర్చితివేని నాజీవితమంతయు నీసేవకు వినియోగించెదను. నీపాదమాన.నీసేవమానను పాప కర్మము లాచరింపను. ఓదయామయా! నన్నీ గర్భనరకమున మరల మరల బడకుండ ననుగ్రహింపుము. ఓదీనజనబాంధవా నాకు నీకంటె దిక్కులేదు రక్షింపుము అని వేడికొనుచు రెండు చేతులు జోడించి నెత్తిన జేర్చి మొక్కుచు నదేవిధ ముగా తల్లి గర్భగోళము నుండి వెలువడియును నదేధ్యాన మనస్కులమైయుండ బిడ్డయేడువ లేదనిశంచములు వాయిం తురు. చల్లగా సాగనీయుదురు తల్లి మొదలగువారు రోదచే

యుదురు. మనకప్పటికా మనస్సుపోయి మరియొక విధముగా మారి మాయామయంబగు ప్రపంచమున కభిముఖులమై యేడువ మొదలు పెట్టి మాతృ సంరక్షితులమై యాకలి జనించినపుడెల్ల నేడ్చుచు జనయిత్రి స్తన్య మొసంగిన గడుపు నిండ ద్రావి నిదురించుచు బొత్తికలలో మలమూత్రముల నించుచు నించిన మలమూత్రములు శరీరమునిండ బాము కొనుచు చెప్పరాని యిడుములబడి శైశవము గడపి యయిదవ సంవత్సరము రాగానే విద్యాభ్యాసము జేయుచు నాటబాట లతో గాలము పుచ్చుచు పెరిగి వయస్సు రాగానే యహం కార మమకారములకు లోనై యింద్రియ విషయేచ్ఛాపరా యణత్వమున కాలము గడుపుచు నాడాతల్లి గర్భములో నొనర్చిన భగవధ్యానాదుల విస్మరించి దురహంకారమున పండితులమనియు, కవీశ్వరుల మనియు, భోగులమనియు, జ్ఞానులమనియు, యోగులమనియు గర్వించి పెద్దలకు నమస్క రించినగాని, పెద్దలయెడ వినయ విధేయతలు జూపినగాని తమ గౌరవమునకు హానివచ్చునని తలంచి పెద్దలయెడ నిరాదరణము జూపుచు భగవద్భాసుల నెగతాళి జేయుచు నొకటి యనయేల నా నెన్ని కృత్యములాచరించి యధోగతిపాలు కావలయునో న్ని కృతములలో నొకటియేని విడువకచేసి మృత్యుదేవత ల్బడి, ఘోర నరకబాధల ననుభవించి మరల వచ్చి ము కుక్క కడుపునో పడవలసిన వారమగుదుము. పుట్టిన వానికిచావుతప్పదు. చచ్చినవానికిపుట్టుకతప్పదు మనము మను ష్యులమైపుట్టివిధినిషేధములు,ముపాపపుణ్యాలు, జ్ఞానజ్ఞానములు కర్తవ్యాకర్తవ్యములు తెలిసికొనవకాశము భగవానునిచే

నియ్యబడి వచ్చినాము గనుక, మనమీజన్మమును వ్యర్థముగా గడుపరాదు. ఆకలిగొన్నవాడన్నమున్నదని చెప్పికొనినంత మాత్రమున నాకలితీరినవాడుకాడు. దప్పిగొన్నవాడు జలస్మరణమున పిపాసా నివృత్తి చెందడు. కాముకుడు స్త్రీ రూపధ్యానమున కామ నివృత్తి జెందినవాడు కాడు. రామశబ్దము కారాంతమేనా యని యడుగగా నకారాంతమో యికారాంతమో తెలియదు కాని నాకది ప్రాణాంతముగా నున్నదను మన బోంట్లకు వేదశాస్త్రేతిహాసముల మాట యెందుకు. వేదశాస్త్రములు జదువని వానికి ముక్తిలేదని యెవరయినను చెప్పిరా? చెప్పినను మన కవి విశ్వసనీయములగునా? ఎన్నటికిని కావు. రోహి యే వేదమును జపెవెను. బోయ కన్నప్పయే శాస్త్రము పఠించెను? సాలెపురుగు ఏభాష్యమును జదివెను. ఏనుగు ఏయితిహాసమును వినెను. కోతులు ఏ వేదాంతమును గ్రహించెను. అన్నలాగా భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ముక్తి ఇవి యెవ్వరిసొమ్ములునుగావు వీని యందొక్క మానవజాతికే గాక, చతుష్పాత్తులకు పశులకు కూడ సర్వాధికారముగలదు. భగవానుడు, సర్వవ్యాపకుడు, సర్వరక్షకుడు, సర్వనియామకుడు సర్వాతీతుడు అట్టి భగవానుని దివ్యనామ మొక్కతూరి, భక్తి పూర్వకముగా స్మరించిన యెడల సర్వబంధములు తెగి పోవును. జన్మ కర్మలు, పటాపంచలగును. ముక్తి కరతలామలకమగును. మనమెంతవరకును మన జనన మరణ దుఃఖప్రవాహమెట్లింకి పోవునాయని యోచింపవలసిన వారమే కావలయునుగాని, డంబాచారులము కాకూడదు. డంబములవలని ప్రయోజనముభయలోక ములందును లేదు. ఈసంసారము

గారడివంటిది. మనమెంత కష్టించి యార్జించినను మనతో మనమార్జించిన ధనము రాదు. ప్రాణముకంటె ప్రాణముగా జూచుకొన్న భార్య ప్రాణవాయువులు బహిర్గతములు కాగానే ఈశరీరమును నాయింటిలోనుండి వెలుపలికి దీయుడని పెరల బలిమాలును. మనతో నెవ్వరును రారు. పాపపుణ్యములు మాత్రము మనమేలోకమునకు బోయినను మనవెంటవచ్చును భగవన్నామ విస్మృతికంటె పాపమొందు లేదు. భగవన్నామ సంకీర్తనము కంటె పుణ్యమన్యము లేదు. గనుక మీపాప్రయము వ్యర్థముచేయవద్దు. మహాపాపశుష్కకాంతారమును దహింపవలెనన్న భగవన్నామసంకీర్తనాగ్నియే సమర్థమయినది. "కృష్ణేతి మంగళం నామ। యస్యవాచి ప్రవర్తతే భస్మీభవంతి రాజేంద్ర" మహా పాతక కోటయః అని శ్రీశుక మహాయోగి చెప్పియున్నాడు. ఇట్లే యెందరో మహాత్ములు చెప్పినారు గనుక, మీయందరును, భగవద్భక్తి పరాయణులై తరింతురుగావుతమని ప్రార్థించుచున్నాను.

## మనోరథములు

సోదర సోదరీమణులారా! మన జన్మ పద్ధతులను పెద్దలచే గ్రహించి యథార్థచింతనచేసి మనము జన్మరాహిత్యమును చేసికోవలెను. లేనియెడల మహాప్రకృతి క్రమక్రమముగా మనలను మనోరథవాయువు నంగొనిపోయి భయంకర నరక వహ్నికుండమున బడద్రోయును. మనోరథములకు పరిమితి లేదు. ఎట్లందురా బాల్యమున నేది యెట్లు బోయినను క్రీడ

లాడ మనోరథము కలుగును. ఇంకకొంచెము పెద్ద కాగానే స్థితిగతులను బట్టియో విద్యను బట్టియో లేక కులగౌరవమును బట్టియో ప్రజలందరిలో తనకు గొప్ప గౌరవము కావలయు ననియు, అటు తరువాత పెండ్లి చేసుకోవలయు ననియు పెండ్లము త్రిలోకసుందరి కావలయుననియు దేనినో పెండ్లి యాడిన తరువాత మన జన్మకీభార్యా సంగమమే పరమ పద సోపానమనియు కొంత కాలమయిన పిదప కొడుకులు పుట్ట వలయుననియు పుట్టిన తరువాత తన కుమారుడు సర్వవిద్యా పారంగతుడు కావలయుననియు వానికి కోరిన కట్నమిచ్చి పిల్ల నిచ్చెడివారు గొప్ప సంబంధము కావలయుననియు తన కుమారునకు గలిగిన సంతతికి పెండ్లిండ్లు కావలయుననియు వారికి పుత్రులు కలుగవలయుననియు నొకటి యనయేల మానవజాతి కోర్కెల జెప్పవలయునన్న నేండ్లును పూండ్లును బట్టును. పోనిమ్ము కోరుకొనిన కోర్కెలు కొనసాగునా అన్నియు నెన్నటికిని కొనసాగవు ఒకటి రెండు తాను తలంచి నట్లయినను తక్కిన వన్నియు స్వప్న మనోరాజ్యములవలె వెంటనే నశించును. ఇట్లు వృథామనోరథ ప్రవాహమున కుత్పత్తి స్థానమేదా యని యాలోచింపగా మనస్సే యని తోచక మానదు. మనము సర్వదా ప్రయత్నించి మనస్సును దుష్టమనోరథముల మీదికి పోకుండ నిలిపి ఆత్మాభిముఖము చేయుదుమేని యది మెల్లమెల్లగా నాత్మసుఖానుభవమును మరిగి, క్రమక్రమముగా నది యాత్మ తాదాత్మ్యమును పొంది యానంద స్వరూపమే యగును కావున మనము మనస్సును వృథావాసనల మీదికి పరుగులు పారకుండ చేయుట కర్త

వ్యము ముక్తిముక్తియని చెప్పుకొనుటయేగాని యాముక్తి యాకసము మీాదినుండి దిగివచ్చి మనలను వరింపదు. ముక్తి స్వతస్సిద్ధముగా నుండియే యున్నది. వాసనా వినాశనమేముక్తి యని పెద్దలు చెప్పుచున్నారు. గనుక, మీామనస్సును మీావ శము చేసికొనుట ముఖ్యము.

## చిత్తవృత్తిని నిగ్రహించుట

ఓరి జీవా! నీవపరిచ్ఛిన్నుడవై, నిర్వికారుడవై, అద్వితీయుడవై అఖండ పరిపూర్ణ సచ్చిదానందుడవైన బ్రహ్మవు. నీవది యవిద్యావృతుండవై మరచి దేహాధ్యాస వలన చిక్కుపడి మోహలతా బద్ధుండవై జన్మపరంపరల నెత్తువాని లాగున దోచు చుంటివి గాని నిజమునకు, "జన్మైవ తేనాస్తి, తదైవ మృత్యుః। నాస్త్యేవ నిత్యస్య విభోరజస్య" నిత్యుడవు, విభు డవు, అజుడవు అగు నీకు జన్మయు లేదు అట్లే మృత్యువును లేదు. నీవు దేహాత్మభ్రాంతి యవిద్యావశంబున జెంది, నాభార్య నాబిడ్డలు, నాయిల్లు, నాది నాది యని దుర్భ్రమనొంది యున్నాడవు నీస్వరూప లక్షణములు నిజముగా నీవెఱుంగవు నీకీ సంసారము అధ్యాసవలన గలిగినది కావున నామాట యొక్కటి కడపటిదివినుం. లోకానువర్తనమును, శాస్త్రాను వర్తనమును, దేహానువర్తనమును, మొదలంటవిడచి స్వాధ్యాసను విడచిపెట్టుము అప్పుడు నీవు నీవే యగుదువు.

## ఎరుక

సోదరా! నీవు ప్రేమించు బంధుమిత్రులును దారపుత్రాదు లును, దేహసంబంధములుగాని, ఆత్మ సంబంధములు కావు.

నీప్రకాశము నొంది బలవంతమై సంకల్ప వికల్పంబుల నిము సమునను లెక్కలేనివి జనింపజేయు 'మనస్సు నభిమానశూన్యు డవగు నీవభిమానివైనట్లు యంత్రపు బొమ్మలాగున నాడి యథఃపతనమగుచున్న వానివలె దోచు చుంటివి. నాది నాది యని పోరలాడి నీతాత ముత్తాతలవంటి వారెందరెందరో పోయిరి. వారెచటికి పోయిరో, ఏస్థితి జెందితిరో తరువాత నేమికానుంటిరో, మనమూహింప జాలము. ఆపోయినవారు వారి శరీరమున గోచియును లేకుండ తగులబెట్టబడిన వారే. పూరి పుడకయును వెంటగొంపోయి యెఱుగరు. క్షేమించు వారినందరిని వీడి వారెట్లుపోయిరో, పోవలసినవారు నట్లే పోవుదురని తెలియుచునే యున్నది. పెద పేరికి దిగినంత చిన పేరికి దిగుటను సామెత వృథాగాదు. ఎండమావులు జలం బులనిభ్రమసి దప్పిగొనిన లేడి తజ్జలంబులకై పరువెత్తిపరువెత్తి యలసి యసువులు వాయుచందమున దురాశాదాహా బాధితులమై మనుమరీచెకలబోలిన సంపదకై ప్రాకులాడి తుద కాలేడి చందముననే యగుదుమని జ్ఞాపకముంచుకొనుము. అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుము. ఈశరీరము నిత్యముగాదని త్వరపడుము నిత్యసుఖస్వరూపుడగు నీవు మహాభయంకర సంసారారణ్యములో జిక్కినట్లుటింవి. ఈయారణ్యములో చుట్టా లను దొంగలు, విషయములను పెద్దపులులు, వాంఛలను క్రూరసర్పములును, కామ రోషాదులను భల్లూకములు మఱియు ననేక విషయవిషమ దృశ్యములు కలవు. కలవని నీవు భయపడ నవసరములేదు, నీవు భయభ్రాంతుల కాకరం బగు మనస్సంగము వీడితివేని వెంటనే యివి యున్నియు

నదృశ్యంబులై పోవును. తత్ క్షణమే నీవానంద మయత్వము చెందగలవు.

## గురు శిష్య ప్రశ్నోత్తరములు

శిష్యు... కం॥ శ్రీగురుమూర్తి వటంచును। నే గుణుతించితి మహాత్మ నిరవధికకృపన్। నా గుణుతు నాకు దెల్పవే। ధీగణ్యా బుధేంద్రమాన్య। దేశికవర్యా॥

కం॥ తేకువచెడి, భవమను పెను చీకటిలో జిక్కి వెతల జెందితిని, నమోవాకము లొనరించెదం దుర్గ్ధికుడ గణింపు మయ్యా। దేశికవర్యా॥

కం॥ తారకముసాంఖ్యమునుగడు। నోరిమి నమస్కమనెడి యోగత్రయమున్। గూరిమి దెల్పి కృతార్థతం ధీరోత్తమ నాకు గూర్చితివి గురువర్యా॥ (సాష్టాంగ నమస్కారమును సలిపి)

గురుప్రభూ... కరుణామయులగు మీ యుపదేశ మందిన మహాభాగ్యమున నాకు సాధు సజ్జనుల సహవాస మయాచిత ముగా లభించెను. మానసికంబులగు మూఢ వృత్తులు శశించెను. దేవతారాధన గీతాపారాయణ వేదాంతవాక్య శ్రవణ జప తపంబులు నిర్విఘ్నముగా సాగుచుండెను. పెద్దలను గౌర వించుట, లోకోపకారము చేయుట మొదలగు కృత్యముల బాల్గొనుచుంటిని. ఇదియంతయు భవదనుగ్రహమని మీపాదు కల స్మరించుచుంటినిగాని, అయ్యా నాకృతార్థతకిది చాలునా చాలనియెడల దీనుడనునన్ను కరుణించి చెప్పదగియుంటినేని పరమార్థ విశేషముల దెల్పుటకు మిమ్ము ప్రార్థించుచున్నాను

గురువు:- ఓయీ సంతోషము సంతోషము గురువులుపదే శించిన మార్గమనుసరించుటయే శిష్యులకు గురు ఋణవిముక్తి

గురువు లుపదేశించిన పథము వివర్జించుటయే గురుద్రోహము నీవు సలుపుచున్నదియును పరమార్థమే. ఇంకను నీకేమిసందేహమో? ఏమి కావలయునో తెల్పుము. శిష్యుల హృదయ సంతాపమును దీర్చుట గురువులవిధి గనుక నీకున్న సందేహముల నివృత్తి చేసెదను చెప్పుము.

శిష్యు... ధన్యుడను దేవా! దేహపరిశోధనమును గూర్చి వినవలయుననియున్న నాయందు దయయుంచి తెలుప ప్రార్థించుచున్నాను.

గురు... బిడ్డా మంచి సందేహమే కలిగినది. స్వదేహపరిశోధనము ముఖ్యావసరము. దేహము నశ్వరమనియు జడమనియు దెలియుచున్నదిగనుక, నశ్వరమయినదానిని విచారణ చేసినచో నిత్యమయినదేదో తెలియగలదు. నిత్యమయినదాని నెఱింగిన గాని మనమానంద స్వరూపమును గురుతింపజాలము. చెప్పెదను విను. కరచరణములు కలిగి మరియు మొద్దులాగున గనుపడుచున్నది. గనుక, ఈదేహము స్థూలమందురు. ఈస్థూలదేహము త్వక్కు, మాంసము, చర్మము, శల్యములు, రక్తము, నరములు, మేధస్సు, మజ్జ, వస, మలమూత్రములు మొదలగు పదార్థమయమై యుండును మరియు నఖములతోను, రోమములతోను నిండియుండి కలుగుట పుట్టి పెరుగుట, పరిణమించుట, కృశించుట, నశించుట మొదలగు నారు వికారములతో గూడి యుండును. ప్రస్తుత మిట్టి వింత బొమ్మ యేర్పడుటకు తలి దండ్రుల శుక్లశోణితములు కారణము. పంచీకృత మహాభూతసంభవమును కర్మ సంచితమునై జీవునకు భోగస్థానమై యుదియుండును

శిష్యు... సూక్ష్మశరీరమందురే దాని. పుట్టుక యెట్లో సెల వీయుడు.

గురు... శాస్త్రముచే నూహింపదగినదియు స్వానుభవ దర్శనీయమును స్థూలములాగున దోచనదియు నగుటవలన దీనిని సూక్ష్మ శరీరమందురు. ఇదియే జీవునకుపాధి. దీని మూలకముగానే జీవుడు యాతాయాతములు జెందుచుండును. ఇది కూడ నిత్యమైనది కాదు. కాని మాటిమాటికి స్థూలశరీరము లాగున నిది సామాన్యముగా నశించునదిగాదు. మొత్తము మీద దీనికిని భంగము లేకపోలేదు అదికారణముగా సూక్ష్మమునకుకూడ శరీరమని పేరు వచ్చినది. జీవుడెన్ని కోట్ల జన్మములెత్తుటకు కూడ నిదే యాధారము. ఇది కర్మేంద్రియములయిదు, జ్ఞానేంద్రియములయిదు, ప్రాణములయిదు, మనస్సుతోకూడిన బుద్ధిచిత్తముతోకూడినయహంకారము ఈపదునేడును కూడి సూక్ష్మమగును. పందొమ్మిదియనికొందఱనుటేమి అప్పుడు మనోబుద్ధి చిత్తాహంకారములు నాలుగు గ్రహింపనగును.

శిష్యు... కారణ దేహస్వరూపమెట్టిదో?

గురు... స్థూలసూక్ష్మములు కార్యములై తోచుచున్నవి గనుక కార్యమునుబట్టి కారణమూహింపవలయును. ఎట్లనగా కార్యమయిన పొగనుబట్టి కారణమయినయగ్ని నూహించినట్లే. అవియునుగాక నేను తెలియనివాడను, మూఢుడను, అను ప్రసిద్ధి యొకటికలదు. గనుక స్థూల సూక్ష్మములకు కారణమగుటవలన దానికి కారణ శరీరమని పేరు. కారణమన్న జాలదా? శరీరమనుట యెందుకందువా? అదియును నశించు

నదియేకదా. అందువలన శరీరమని పేరు వచ్చినది.

ఈస్థూలమునకు జాగ్రత, స్వప్నము, సుషుప్తి యను మూడవస్థలు కలవు. జాగ్రదవస్థ యనగా సకలేంద్రియముల వలనను బాహ్యములగు విషయము లెంతవరకు గ్రహింపబడుచున్నవో అంతవరకు జాగ్రదవస్థ ఈయవస్థయందభిమానియగు జీవునకు విశ్వుడని పేరు. స్వప్నావస్థయనగా, సకలేంద్రియముల వలనను బాహ్య విషయజ్ఞానమురాక, ఒక మనస్సే విషయాకారంబుగామారిమనస్సేకర్త్రాద్యాకారంబుగా నెంతవరకుండునో అదిస్వప్నావస్థ దీనియందభిమానియగు జీవునకు తైజసుడని పేరు. ఇక సుషుప్త్యవస్థయనగా, సకలేంద్రియంబులకును బాహ్యజ్ఞానమురాక, మనస్సే విషయాకారంబుగానైన నుండక, బుద్ధికారణాకారంబుగా నెంతపర్యంతముండునో అదెసుషుప్త్యవస్థ. దీనియందభిమానియగుజీవుడుప్రాజ్ఞుడు, మఱియు దీనియందు అన్నమయప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనుపంచకోశములుకలవు. అన్నమయమనగా, అన్నము వలనబుట్టి కాల్సేతులుగలిగిస్తంభమువలె దోచుచుషడ్వికారములతోగూడి యుండునది. ప్రాణమయమనగా, కర్మేంద్రియములు, ప్రాణేంద్రియములు పదియును, ప్రాణమయకోశము. మనోమయమనగా, మనస్సును జ్ఞానేంద్రియములయిదు నీయాయును మనోమయ కోశము. విజ్ఞానమయ కోశమనగా బుద్ధియును జ్ఞానేంద్రియములయిదు నీయాఋగూడియైనది. ఆనందమయమనగా ప్రియమోదములు కలిగి, అజ్ఞానమే ముఖ్యముగా గలది. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, జ్ఞానకర్మేంద్రియ విషయములు పది. మనోబుద్ధి చిత్తాహంకారం

బులు నాలుగును కలసి ఇరువదినాలుగు తత్వములాయెను. ఇరువది యైదవవాడు జీవుడగును. ఇదిగాక ఈ దేహమున కామక్రోధలోభమోహమదమత్సరంబులను షడ్వర్గముకలదు ఆకలి, దప్పి, శోకము, మోహము, నిద్ర, తంద్రలను షడూర్మలు కలవు. ప్రాణాపానవ్యానోదానాది, పంచప్రాణములు నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయములను పంచోప ప్రాణవాయువులు కలవు. ఇవియన్నియు పంచీకరణపద్ధతిని చూడదగును. దశవిధనాదములు, ఊర్ధ్వలోకములు, అధోలోక ములు, సప్తద్వీపములు, సప్తసముద్రములు, దేహత్రయవివరము షడూర్మలు, షడ్భావవికారములు, ఓంకారప్రకరణము, అష్ట మదములు, తాపత్రయములు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారములు, అంతఃకరణ చతుష్టయవివరణము మొదలగు నవి పెద్దలవలన విస్పష్టముగా తెలిసికొనుట మంచిది. ఈపైని పేర్కొనబడిన వన్నియు నాత్మయందధ్యస్తమయినవి గనుక నేతి నేతివాక్యముల హృదయమందుంచుకొని దేహపరిశోధన చేసి ఇందులో నేదియు నేనుగాను నేను నిష్కళ, నిర్వికల్పక సత్తామాత్రుడనని దేహేంద్రియ వ్యతిరిక్తుడనని తెలిసికొను టయే ఈ దేహపరిశోధన వలన ప్రయోజనము.

శిష్యుడు... స్వామీ ఎనుబదినాలుగులక్షల జీవ సముదాయ మందురుగదా! వాని వివరమును తెలుపగోరు చున్నాను.

గురు... ఓయీ వృక్షజాతులు ఇరువది లక్షలు. జలచరవర్గ ములు తొమ్మిదిలక్షలు. క్రిమికీటకములు పదునొకండులక్షలు. మానవజాతిభేదములు నాలుగులక్షలు. చతుష్పాత్తులుముప్ప దిలక్షలు. పక్షిజాతి పదిలక్షలు, స్వేదజములుఅయిదులక్షలు.

వాయుజము లయిదులక్షలు, మొత్తమెనుబదినాలుగు లక్షలు ఇయ్యెనుబది నాలుగులక్షల జీవ సముదాయములో మనుష్య జన్మ మాత్రము బహుదుర్లభము. మనుష్యజన్మ బడసిన వారిలోవిద్వాంసుడగుట కడుంగడుదుర్లభము. ఆ విద్వాంసు లలో నాత్మానాత్మావివేకము గలుగుట పరమ దుర్లభము. ఆత్మానాత్మ వివేకము గలవారిలో కేవలబ్రహ్మ విద్వరిష్ఠు డగుట యత్యంత దుర్లభము. ఓయీ బ్రహ్మచారియు;గృహ స్థుండును వానప్రస్థుండుకూడ ఆత్మానాత్మ విచారణచేయుట ముఖ్యమగువిషయమేగాని, సన్యాసి గానివాడు వేదాంతవిచా రణచేయుట కప్పలను త్రాసులో బెట్టి తూచినట్లుండును.అనగా త్రాసులోకప్పలునిలుచుటయు, గృహస్థుడగువాని చిత్తవృత్తి నిలుచుటయు సమానముగా నుండును. గనుకనే, "మోక్షాధి కారీసన్యాసీ గృహస్థః కిఞ్చకర్మణి" అని వేదాంతులు చెప్పు చున్నారు.అయిననుగృహస్థుడుకూడ అంతస్సన్యాసియగు నేని కృతార్థుడె యగును.

## సందేహవాక్య ఫలితములు

అజ్ఞానాంధకార పరివృత్తులై దేహేంద్రియాభిమాన మున నొడలు తెలియక కేవల పుణ్యకర్మలయందు గాకున్నను మిశ్రమ కర్మలయందైన మనస్సును ప్రవేశపెట్టక కొందరు; కొందరు పుణ్యకర్మలయందు మనస్సును ప్రవేశపెట్టి చేయుచు కాలము గడపి యాశరీరమును విడచి, తిరిగిజన్మించి, యాయా కర్మఫలము లనుభవించుట చిత్రముగానే యుండును కొంద రికి భూవసతి కలిగి యుండును. కొందరి కాభూవసతి యుం డియు ఋణాధిక్య మగుచుండును. కొందరు ఋణపడియును,

మహాభోగము లనుభవింతురు. కొందరు మహాధనవంతు లయ్యును, నిరుపేదలకంటె త్యాగ భోగములందు హీనులుగా నుందురు. కొందఱు బహుసంతాన వంతులై కుటుంబభారమున నల్లాడి యాకులు మేయుచుందురు. కొందరు మితిమీరిన భాగ్య భోగ్యములు కలిగి సంతానమునకై సర్వ ప్రయత్నములు చేయుచుందురు. కొందరు పుత్రవంతులయ్యును వారు దుర్నీతిపరులగుటకు చింతించుచుందురు. మరియు ననేకుల నేక విధములగు కష్టసుఖముల నందుచున్నారు. ఇదియంతయు జూడగా, నొక్కవిత్తన మొకవృక్షమై పెక్కు ఫలముల గాచినరీతిగా, చేసిన కర్మ యొక్కటియైనను నదియనంతంబులగు ఫలములనీయగలదని తోచుచున్నది. అందువలన కర్మరతుడైనను దుష్కర్మలనుమాని సుకర్మలయినను చేసి, చేసిన సత్కర్మఫలమున పేక్షింపక, కర్తృత్వముకూడ తనపై నారోపించుకొనక యుండినచో నట్టి కర్మఫలములు చేసిన వానికి జెందవు. పరమేశ్వరునకే చెందును. తన్మూలమున దయామయుడగు నద్దేవదేవుడు చిత్తశుద్ధి యొసగి, చిత్తశుద్ధిద్వారా జ్ఞానదానము చేయగలడు. అంతవరకే సత్కర్మఫలమయినను చేయునుగాని జ్ఞానమును మాత్రము కలిగింప నేరదు. గడ్డిమేటికి, నగ్నికి, చీకటికి, తేజమునకు నెట్లు సంయోగము కూడదో అట్లే, జ్ఞానకర్మలకుసంయోగము కలుగదు. ముముక్షువగువాడు సంకల్ప నాశనమునకు యత్నించునుగాని, సంకల్పమెన్నటికినికాదు. వానికి సిద్ధులతో నవసరములేదు. అతనికి మోక్షేచ్ఛకూడ బంధమేయగును, లోకములో నెవ్వడైనను ముముక్షుతకై యత్నించుచు స్వప్నతుల్యములగు

సంకల్ప వికల్పముల చేయుచుండుట మంద లక్షణముగాని యన్యముకాదు.

## వైరాగ్యబోధోపరతులు

ప్రశ్న... మహాత్మా వైరాగ్య బోధోపరతుల హేతుస్వరూపములును, వాని యవధియు దెలుపగోరుచున్నాను.

గురు... వైరాగ్యము, బోధ, ఉపరతి, యీమూడును పరస్పర సహాయములు గలవిగా నుండుట సహజము. కాని యొకప్పుడొక్కని యందొకటి విడివడును, సమస్త విషయములను కక్కిన యన్నమువలె కోరకుండుట వైరాగ్యమునకు హేతువు, మొదలా విషయంబులందు వాంఛయే లేకుండుట స్వరూపము, కోరికల ననుభవించక యెందుకు విడచితిమిరా యను సందేహము రాకుండుట కార్యము. బోధకు శ్రవణాదులు హేతువులు. ఆశ్రవణాదుల వలన గలిగిన జ్ఞానముచే నేను బ్రహ్మను, ప్రపంచమునకు దేహేంద్రియాదులకు నేనతీతుడననియెడి దృఢనిశ్చయము స్వరూపము. పంచకోశాదులు నేను గానను నిశ్చయము కార్యము. ఉపరతికి నియమాదులు హేతువులు. చిత్తస్థైర్యముస్వరూపము. వ్యవహారశూన్యత్వము, కార్యము, వీని కవధులని చెప్పెదను వినుము, వాసనలుదయింపకుండుటే వైరాగ్యమునకవధి, అహంకారము జనింపకుండుటయే బోధకవధి. పరమాత్మయందు లీనమైన మనోవృత్తి మరల జనింపకుండుటయే యుపరతికవధి. కావున వైరాగ్యము తన కెంతకలదో జ్ఞానమెంతవరకు గలదో; ఉపరతి యెంతవరకు కుదిరినదో, పైవానింబట్టి చూచుకొనవలయును గాని డాంబికపు పోకడలు పోజూచిన నిష్ప్రయోజనము

# మంత్రానుష్ఠానము

శిష్యు... గురూత్తమా? మంత్రానుష్ఠానపరులకు ముక్తిసులభముగాలభించునా?

గురు... ఓయీ మంత్రానుష్ఠానములు చేయవలసిన పద్ధతిలో చేయుచుంటిరేని ముక్తిని సులభముగానే పొందగలుగుదురు. చేయవలసిన పద్ధతి వినుము. అనుష్ఠానము మూడువిధములుగా చేయుచున్నారు. వాచాజపము. మంత్రాక్షరముల బిగ్గరగా నుచ్చరించుచు మంత్రాధిష్ఠాన దేవతను గురుతింపక మనస్సును స్వేచ్ఛగా విడచి చేయుజపము కొంచెము ప్రయోజనకారిగా నుండును. అనగా, పవిత్రములగు మంత్రాక్షరముల నుచ్చరించుట వలన నది వాగింద్రియము చేసిన పుణ్యమగును. వృధాగా నట్లయిననుపోదు. ఇక మానసిక జపముపాంశువు. తాను వేరని మంత్రాధిదేవత వేరని తలంచుచు మంత్రాధి దేవతను ధ్యానశ్లోకోక్త ప్రకారముగా పాదాదికేశాంతమును మనస్సున ధ్యానించుచు మంత్రమును బిగ్గరగా నుచ్చరించక తాలోష్ఠములతో మంత్రబీజముల నుచ్చరించుచు చేయునది, ఇది వాక్జపముకంటె నూరురెట్లు ఫలముకలదు. ఇక ధ్యాన జపము దీనినే పరజపమందురు. ఈపరజపానుష్ఠానపరుడు శుచియై విజనప్రదేశమున విశ్రమించి సర్వేంద్రియముల నాకుంచనంబుచేసి యింద్రియ విషయ ధ్యానమయినను చేయక మనస్సును నిలువబెట్టి పవిత్రహృదయుడై మంత్రబీజముల నఖండ తేజోమయములుగా మూలాధారమునుండి సహస్రారాంతము భావనచేయుచు నిరతమును విస్మరించి తనకు

మంత్రాధి దేవతకు, గురువులకు, మంత్రమునకు నభేదమును పాటించుచు, తాల్వోష్ఠములనైన నాడింపక, కనులుమూసి, యానందపరవశుడై, తనువున రోమాంచలము లుప్పతిల, నంతర్నేత్రముల మంత్ర బీజముల సూత్రమున గ్రుచ్చబడిన మణులవలెను, పర్యుపరిస్థితంబులుగా దర్శించుచు, నంతశ్శ్రవణముల తన్నాదము నాలించుచు, జేయు జపమును తుదకు విరమించి, మనోలయముచేసి, నిశ్చేష్టితుడై తనను మరచి, యూరకుండు జపము పర జపము. అనగా ... బిగ్గరగా పోరుగువారికి వినబడునట్లు చేయుజపము. స్థూలము రహస్యముగా తనకు మాత్రము వినబడునట్లు జేయు జపము సూక్ష్మ జపము తనకుకూడ వినబడకుండ మంత్రాక్షరములను నుచ్చరించకుండ జేయుజపము. పరజపము ఉపగజపమే మనోలయము. "జ్ఞానకోటి సమోలయః" మనోలయమే బ్రహ్మము, బ్రహ్మమే తాను. దాసూ! విన్నావా!? ముక్తి ముక్తియని వేరుగా నెచ్చటినుంచి వచ్చును? వాసనా క్లేశముల నశింప జేసి, గాలిలేని చోటనున్న దీపములాగున, నిశ్చలమగు మనస్సు కలుగుటే ముక్తి. అనగా ... ననాత్మ స్ఫురణ రాకుండుటయే ముక్తి. మహాఋషులు ముక్తులుగాక, ముక్తి మార్గము తెలియక, తలక్రిందుగా తపస్సు చేసినారని తలంచుట యవివేకము. ముక్తులయినంత మాత్రమున ప్రారబ్ధమయిన కర్మ నశింపదు. గనుక ప్రారబ్ధము క్షయమగు పర్యంతము శరీరములుండకపోవు. మహాత్ములు బ్రహ్మీభూతులు గనుక వారికా శరీరములు; శరీర ధర్మములును; బాధకములుకావు. ముక్తులకుకూడ శరీరములు నశింపవా యన

వలదు. కలబంద మూలము నశించినను అది నశింపదు మంట ఆరిపోయినను పొగ పోదు. అట్లే శరీరములుకూడ యోగులకు ప్రారబ్ధము క్షయమగు పర్యంతమును పోదు, గనుక మంత్రానుష్ఠానముకూడ జ్ఞానయుక్తమయ్యేనేని ముక్తిదాయకమగుట నిస్సందేహము.

## మహా మంత్ర మహిమ.

[ఇదిమళయాళస్వామివారి బోధభాస్కర ప్రతిబింబములోనిది] సోదరులారా! మహామంత్రములగూర్చి విచారింతము. ఏమన తారక మంత్ర మహిమచేతనే గదా శ్రీ యాంజనేయులు, వాల్మీకి, విభీషణుడు, గుహుడు, కభీరు, రామదాసు మొదలగువారు కృతార్థులైరి. అలాగున శివ మంత్ర మహిమ చేతనేగదా మార్కండేయుడు, శివనాక్కులు మొదలగు పదునెనమండ్రు సిద్ధులును; తిప్పరు మాణిక్య వాచకులు మొదలైన యిరువది ముగ్గురు నాయనార్లును మరియు ననేక సిద్ధపురుషులపార మహిమ గలవారైరి. అటులనే శ్రీనారాయణ మహామంత్రమహిమచే నారదాది మహామునులు, నమ్మాళ్వారు మొదలైన పండ్రెండుపురాళ్వారులను మహా జ్ఞాన సంపన్నులయిరి, గాయత్రీ మంత్రమును శ్రీవశిష్ట మహాముని బ్రహ్మదండములో నావాహనము చేసినందున విశ్వామిత్రుడా బ్రహ్మ దండమును జయింపజాలకపోయెను. గనుక మంత్ర మహిమ యగణ్యము. ఫలము నపేక్షించిగాని, సిద్ధినపేక్షించి గాని యనుష్ఠించిన వారికా ఫలములు కలుగునుగాని, బంధ రహితము కానేరదు. ఫలాపేక్ష గలవారు బహిర్ముఖులు.

అంతర్ముఖులకుగాని జ్ఞానోదయముకాదు. జ్ఞాన సంపన్నులు గాని వారికెన్ని సిద్ధులుండినను శోక నివృత్తియు, నానంద ప్రాప్తియు కలుగదు. గనుక, చిత్తైకాగ్రతతో జపము చేయుటమంచిది. అట్లుచేసిన జప మావరణ నిక్షేపరహితమగు జ్ఞాన తాదాత్మ్యమునుపొంది, తైలరహితమగు దీపమువలె తనంత దానె శాంతించును. అంతవరకు మంత్ర జపము చేయుచునే యుండవలయును. ఎన్ని మంత్రముల జపింప నేర్చినను నాత్మానాత్మ విచారణలేనివారికి బ్రహ్మ సాక్షాత్కారము కానేరదు. కొందఱు మాత్రము నిరంతర జపానుష్ఠానపరులై పరమేశ్వరానుగ్రహమున నాత్మ నిష్టయు గల వారగుచున్నారు. కాని యిది యందఱికిని సాధ్యముగాదు. పరమేశ్వరారాధన సక్రమముగా జేసినవారికి క్రమముగా వేదాంతానుభవము కలుగుట సుప్రసిద్ధము. అంతదనుక నోపికపట్టి యనుష్ఠింపవలయును. మనమొక ఫలవృక్షమును నాటి ఫలోదయ పర్యంతమావృక్షము నెట్లు పోషింతుమో అట్లే జ్ఞాన ఫలోదయమగు పర్యంతమును భగవదర్చా బీజమును శక్తి వంచనలేకుండ పోషించుచునే యుండవలెను. అల్పబుద్ధులును కారణాంతర భక్తిపరులునగు వారికామంత్ర మహిమలు మరుగుపడిపోవును. మహా మంత్రములలో నేకాక్షరమాత్ర మంత్రములును కలవు. అట్టి మహామంత్రము చిన్నదనియు, ఫలమునీయ నోపదనియు నిరశింపరాదు. వట బీజము సూక్ష్మమయినను నది గొప్ప వృక్షముగా బరిణమించునట్లు మహామంత్ర మెంత చిన్నదియైనను దాని పరిణామము గొప్పదియేయగును. అయినను సిద్ధులనుగోరి మంత్రా

నుష్ఠానము చేయరాదు. సిద్ధులాత్మ జ్ఞానమునకు బాధకము లుగాని సాధకములుగావు. పరమేశ్వరాను సంధానము లగు జప ధ్యానాదులు, జ్ఞానదములగుటకు సందియము లేదు. ఈ మహామంత్రములుగాక శాబరములను నొకమంత్రగణము గలదు. మనమామంత్రముల ననుష్ఠింపరాదు. అనుష్ఠించినచో నవి యహంకార జనన స్థానంబులై, నింద్య వాంఛాపరిపూరి తంబులై, యుపాసకుని నరకకూపమున గూల్త్రోయును. తారక మంత్ర మనగా జననమరణ రూపక సంసార సాగర మును తరింపజేసెడి దగుటచే దానికాపేరు వచ్చినది, గనుక తారకమను పడవ నాధారముగా జేసికొని, సంసార పారా వారము నుత్తరించి, బ్రహ్మానంద పదవిని పొందవలయును. వత్సము నాశ్రయించి, వెనుకొను ధేనువులాగున, తారకాది దేవత జపితను వెనువెంటనుండి రక్షించుచుండును. పర మాత్మ యమృతుడు గనుక నతని నాశ్రయించిన భక్తులు నమృతత్వమును జెందుదురు. అట్లు అమృతత్వమును పొంద వలయునన్న మనశ్శుద్ధితో తారకమంత్రానుష్ఠానముచేయుట మనకు విధి.

## ఒక మానవ జాతికి వృత్తి భేదములు.

ప్రశ్న:- గురుప్రవరా! శరీరములన్నియు భౌతికము లేకదా? వృత్తి భేదములేల యేర్పడినవో సెలవిండు.

ఉ॥ ఒక మానవ శరీరములేగాదు, లోకమునగల స్థూల శరీరములన్నియు భౌతికములే. ఒక పంచీకృత మహా భూత ముల వల్లనేగాక, జీవుని కర్మయు శరీరమునకు కారణమే

గావున కర్మలయొక్క ఫలము పృథివ్యాది భూతములలో మిళితమై కర్మానుగుణములగు శరీరముల నుత్పాదించును. అదికారణముగా శరీరవైచిత్ర్యము లేర్పడుచుండును. ఈశరీర శకటము నభిమానముతో నడిపించుటకు సూక్ష్మము చోదకంబయియుండును. అయితే ఒక్కొక్కజీవునకు ననంతములగు స్థూలములు వచ్చుచుబోవుచునుండును. గాని సూక్ష్మశరీరముమాత్రమెన్నటికిమారదు. ఏలయందువా, జీవుడొక్కడే బహుకర్మ ఫలముల ననుభవింప వలసినవాడై యున్నాడు. గనుక, నాయా కర్మఫలములనెల్ల నాయా శరీరముల ద్వారా తాననుభవించుచుండును. ఒక్కతల్లిదండ్రులకే నలువురు పుత్రికలు గలిగినచో వారిలో నొకడు ధీరుడగును ఒకడు భీరుడగును, ఒకడు చోరుడగును, ఒకడు జారుడగును, దీనింబట్టి చూడగా నానలువురను కుమారకులనుగాగని వారి వలన గలుగు సుఖదుఃఖముల ననుభవింపదగిన కర్మమాత్రమే తల్లిదండ్రులదిగాని. ఆధీరత్వము, భీరత్వము, చోరత్వము, జారత్వము, మొదలగు వృత్తిభేదములతో జెరలాడవలసిన కర్మలాకుమారులాచరించి యున్నవేయగును. ఆతలిదండ్రులు కుమారులు, వారిబాంధవ్యులు, సేవకులు, మున్నగువారందఱు నొక్క మానవజాతివారే యైనను కర్మఫలములు మాత్రను వేఱువేఱగుట వలన వృత్తులును కర్మానుసరణములై వేఱు వేఱుగానే యుండును. ఫలభోక్తజీవుడు గావున తాను సూక్ష్మశరీరియైయుండి స్థూలములచే బనులు చేయించుచు సుఖదుఃఖ రూపములగు ప్రారబ్ధ మనుభవించుచు బుద్ధిమారినవాడై యుత్తరజన్మల కనుభవనీయములగు నాగామిసంచిత

